# ఆశాతరంగాలతో ప్రేమనౌక



కొడాలి సాంబశివరావు



నవరత్న బుక్ సెంటర్
ఏలూరు రోడ్ • విజయవాడ-2.

ASATARANGALALO PREMA NOUKA
by
Kodali Sambasiva Rao



Second Edition :
February 1981



Cover Disign :
Trigun

Publishers :
NAVARATNA BOOK CENTRE
Vijayawada - 520 002

Printers :
VENKATARATNA
Vijayawada - 2

Price : Rs. 11-00

# ఆశాతరంగాలలో ప్రేమనౌక

"చంద్రమోహన్... చంద్రమోహన్... త్వరగా రావాలి—" ఇంటర్వ్యూ గదిలోంచి లేడీ పిలుపు వచ్చేసరికి ఉలిక్కిపడి తేరుకున్నాడు చంద్రమోహన్. గుండె దడ దడ లాడింది. కొన్ని క్షణాల్లో తన అదృష్టమెలాంటిదో తేలిపోతుంది. అని అనుకుని అదురుతున్న గుండెల్ని అదిమిపెట్టుకుని లేచాడు. స్ప్రింగ్ డోర్ తెరుచుకుని లోనికి అడుగు పెట్టాడు చంద్రమోహన్.

అది ఎయిర్ కూల్డ్ చేయబడినగది. అధునాతనమైన హంగులతో దేవలోకాన్ని మరిపిస్తున్నట్లుంది. అక్కడికి వచ్చిన కాండిట్స్‌ను ఇంటర్వ్యూ చేయడానికి నలుగురు కూర్చుని వున్నారు. వారంతా మహాధనికులు వారిలో ఓ నలభై ఏండ్ల ప్రౌఢకూడా వున్నది. ఆమె అలంకరణలో అన్ని ఏండ్లు వున్నట్లు కనిపించవు. ఆమె పేరు హేమాదేవి.

చంద్రమోహన్ వారివేపు వినయ పూర్వకంగా చూసి నమస్కరించాడు.

కుర్చీ చూపించారు. వారి ఎదురుగా కూర్చోడానికి చంద్రమోహన్ కొంచం ఇబ్బంది ఫీలయ్యాడు. ఒదిగి కూర్చున్నాడు. ఇంటర్వ్యూ ప్రారంభమైంది.

"నీ పేరు?" ఓ బట్టతలాయన ప్రశ్నించాడు.

"చంద్రమోహన్..."

"సినిమా చంద్రమోహన్ పేరు పెట్టుకున్నావెందుకు? నీవు సినీస్టార్ కావాలన్న ఆశ లేమన్నా ఉన్నాయా?" మరో హిట్లర్ మీసకట్టు అతను ప్రశ్నిస్తూ నవ్వేశాడు. దానికి అందరూ జతకలిపేరు. చంద్రమోహన్‌కి ఏం జవాబు చెప్పాలో తోయలేదు. 'అయినా ఇంటర్వ్యూ అని యివేం ప్రశ్నలు అర్థం లేకుండా! సినిమా యాక్టర్స్‌కున్న పేర్లు మరెవరూ పెట్టుకోకూడదా? అదేదో జోక్ మాదిరి ఎందుకలా నవ్వుతారు!' అని చంద్రమోహన్‌కి కొంచం కోపం వచ్చింది. అయినా తమాయించుకొని, వారితో తానూ నవ్వేస్తూ ధైర్యంగా అన్నాడు.

"అన్యాయంసార్! చంద్రమోహన్‌తో నన్ను పోల్చడం...అతను చాలా పొట్టివాడు. నా హైట్ సిక్స్ ఫీట్స్. కావాలంటే కొలత వేసుకోండి..."

అసాధ్యుడివేనోయ్! నేనేదో సరదాగా అంటే, నా మీదే దెబ్బ కొట్టావే." హిట్లర్ మీసం గలగలా డబ్బాలో రాళ్ళు వేసి మ్రోగించినట్లు నవ్వాడు.

"ఎక్స్ క్యూజ్‌మీ సర్! నేనూ సరదాగే అన్నాను..." అన్నాడు చంద్రమోహన్. ఎందుకంటే వాళ్ళకు కోపం తెప్పించడం తనకే అనారోగ్యమని, జాగ్రత్తగా ఉండాలని అలా అన్నాడు.

వాతావరణం మామూలుగా మారిపోయింది.

ప్రశ్నలు ఒకదాని వెంట ఒకటి దూసుకువస్తున్నాయి.

వాటికి చంద్రమోహన్ సమాధాన మిస్తున్నాడు నేర్పుగా. చివరగా ఓ ప్రశ్న వేసాడు బట్టతలాయన.

"దేవాలయంలో బూతుబొమ్మలుంటాయి దేనికి ?"

ఈ ప్రశ్నకూ— తను చేయబోయే ఉద్యోగానికి ఎలాంటి సంబంధమూ లేదు. ఐనా వాళ్ళు అడుగుతున్నారు గనుక ఏదో ఒకటి చెప్పాలి. లేకపోతే ఏమవుతుందో తను ఊహించగలడు. ఏం సమాధానం చెప్పాలి? దేవాలయంలో బూతుబొమ్మ లుంటాయా? దేనికి? అవును ఎవరో వ్రాశారు దీనిమీద...ఎవరబ్బా... ఆఁ...గుర్తుకొచ్చాడు మహానుభావుడు. తాపీ ధర్మారావుగారు వ్రాశారట. తను చదవ లేదుగానీ, వాహిని చెప్పగా కొన్నిముక్కలు అక్కడక్కడ గుర్తున్నాయి. వాటికి కొంత రూపకల్పనచేసి చెబితే పోలా? అయినా నేను చెప్పబోయేది రైటో, తప్పో తెలిసి చస్తేగా, అని అనుకున్నాడు చంద్రమోహన్.

అందరిదృష్టి చంద్రమోహన్ మీదే నిల్చింది.

గొంతు సవరించుకుని మొదలెట్టాడు చంద్రమోహన్.

"మీరా రడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే ఈ రోజంతా చాలదు. ఎందుచేతనంటే ఆ విషయంపై చాలామంది చాలా రకాలుగా విమర్శించారు. అవన్నీ ఏకరువు పెట్టి మిమ్మల్ని విసిగించదలచుకోలేదు. టూకీగా నా అభిప్రాయాన్ని రెండుముక్కల్లో వెల్లడిస్తాను" అని ఆగి ఒక్కక్షణం ఊపిరి పీల్చుకున్నాడు చంద్రమోహన్.

హేమాదేవి దృష్టి అతనిమీదే కేంద్రీకరింపబడింది. అతను మాట్లాడుతున్నప్పుడు విచిత్రంగా కదిలే అతని పెద వుల్ని తదేకంగా చూస్తోంది ఆమె. ఆరడుగుల పొడవుతో, దృఢంగా ఎర్రని ఎరుపుతో నిగనిగలాడుతూ, అందమైన మీసకట్టుతో యవ్వనంతో పరవళ్ళు త్రొక్కే అతని ఆకృతి ఆమెలో వింత ఆలోచనల్ని రేకెత్తిస్తున్నాయి. అతను చెప్పే విషయాన్ని ఆమె ఆలకించడంలేదు. అతని అందమైన రూపాన్ని తదేకంగా చూస్తుంది.

చంద్రమోహన్ చెప్పుకుపోతున్నాడు ఆ విషయాన్ని గురించి—

"ఇక చాలు. నీవు వెళ్ళు ఫలితాలు ఓ గంటలో తెలియపరుస్తాం..."

అలా మధ్యలో ఆపేయమనేసరికి అతను గతుక్కు మన్నాడు. 'ఏమిటి వీళ్ళు? తను చెప్పేది ఇంట్రస్టింగ్‌గా లేదేమో, పూర్తిగా చెప్పకముందే వెళ్ళిపొమ్మంటున్నారే ఛీ... వెధవ ఉద్యోగం కోసం ఎన్ని పాట్లు పడాల్సివచ్చింది' అని తిట్టుకుంటూ లేచి బయటకు వచ్చాడు అతను.

తర్వాత తంతు యథావిధిగా ఒక్కొక్కళ్ళే లోనికి వెళ్ళి వస్తున్నారు.

చంద్రమోహన్ దూరంగా చెట్టుక్రింద సిమ్మెంటు బెంచీమీద కూర్చుని వచ్చేపోయేవాళ్ళను గమనిస్తున్నాడు. 'ఉన్నది ఒక్కపోస్టు. ఎంతమంది వచ్చారు? అసలు ఈ దేశం ఎప్పటికి బాగుపడుతుందో? పాపం. అందరూ తనలాగానే ఆశలు పెంచుకునివచ్చారు. ఇందరిలో అదృష్టలక్ష్మి ఎవర్ని వరిస్తోందో? ప్చ్! మరో అరగంట గడిస్తేగానీ ఆ భాగ్యవంతుడు ఎవరోగాని తెలీదు—'

'నీవే ఎందుకు కాకూడదు ఆఅదృష్టవంతుడువి?' అని అంతరాత్మ సపోర్ట్ చేసింది.

"ఏమిటి నేనా?" ఊరుకో. ఎవరన్నా వింటే నవ్విపోతారు.

'అంత నిరుత్సాహం వున్నవాడివి ఇంటర్వ్యూకి ఎందుకొచ్చినట్లు? శుభ్రంగా ఇంట్లో కూర్చో కూడదూ? చార్జీల పైసన్నా మిగిలేవిగా!'

'నీవు చెప్పేది మరీ బావుంది. ఇంట్లో కూర్చుంటే వుద్యోగమెలా వస్తుంది?,

'అందుకే నిరుత్సాహం పనికిరాదు బ్రదర్! మానవ ప్రయత్నం చేస్తే గానీ, దైవం అనుకూలించదు. జయాపజయాలు ఆ దైవానికేవదిలేసి నీవు నిశ్చింతగా వుండు. ఏం

జరిగినా ఆశ్చర్యపోకు. చలించిపోకు. ఈ జీవితంలో ఎన్నో వింతలూ, విడ్డూరాలు జరుగుతూ వుంటాయి. అన్నిటినీ గమనించి అనుభవాన్ని పెంచుకో. అప్పుడు సులువుగా బ్రతికి పోతావ్. అసలు నిన్ను పుట్టించేప్పుడే నీపోస్ట్ ఎక్కడో క్రేవుడు సిద్ధం చేసేవుంటాడు. అది ఎక్కడుందో, వెళ్ళేక్కడో నిరుత్సాహపడకు. ఈరోజు లేకపోయినా రేపయినా నీకు తప్పక ఉద్యోగం దొరుకుతుంది—, అని అంతరాత్మ ధైర్యాన్ని నూరిపోసింది.

చంద్రమోహన్ని ఎవరులేరు. ఏకాకి. అసలు తనెవరో? తనతల్లిదండ్రులెవరో అని అతను ఏరోజూ ఆలోచించ లేదు. ఒకవేళ ఆలోచించినా ఆ ప్రశ్నకు తనవద్ద సమాధానం లేదని తెలుసు. తెలిసితెలిసీ అలాంటి వ్యర్థమైనఆలోచనలతో మనసు పాడుచేసుకోవడం అవివేకం. అందుకే ఆద నెప్పుడూ ఆ విషయాల్ని తలవడు. ఒంటరిగా వచ్చాడు. ఒంటరిగానే బ్రతుకున్నాడు. స్నేహితుల దయాధర్మాలమీద, అనాథ శరణాలయాలవల్ల అతను బి.ఏ. పూర్తిచేసుకుని దేశంమీద పడ్డాడు ఉద్యోగంకోసం. గత రెండేళ్ళనుంచి ఉద్యోగన్వేషణలో తిరిగి తిరిగి వేసారిపోయాడు.అయినా విసుగు చెందని విక్రమార్కునిలా ప్రయత్నిస్తూనే వున్నాడు. అమధ్య ఓ రెండు చిన్న ఉద్యోగాలు దొరికాయిగానీ. తన ఒంటికి సరిపోక వాటికి స్వస్తిపలికాడు.

ప్రస్తుతం అతని నివాసం దుర్గాబాయిగారి ఇంట్లో. వాళ్ళమ్మాయి వాహినికి ట్యూషన్లు చెబుతూ, అక్కడే గది

వేస్తున్నాడు. దుర్గాబాయికి, రామచంద్రయ్యకు చంద్ర మోహన్ అంటే మంచి అభిమానం. వారి అభిమానమే అతనికింత అన్నంపెడుతోంది రామచంద్రయ్య పెద్దస్థితిమంతుడేంకాదు, ఓ గవర్న మెంటు ఆఫీసు లో మామూలు గుమాస్తా. మధ్య తరగతి సంసారి. వాళ్ళకి ఒక్కతే కూతురు వాహిని. ఆయన తెచ్చేజీతపురాళ్ళు వాళ్ళ సంసారానికి బొటబొట సరిపోతుంది. పైగా చంద్రమోహన్ పేయింగ్ గెస్టులా. అయినా అందులోనే సర్దుకుంటున్నారు. వాహిని మంచిపిల్ల. చంద్ర మోహన్‌నీ సొంత అన్నయ్యలా అభిమానిస్తుంది. అతనికీ ఆమె అన్నా, ఆకుటుంబమన్నా మీదమిక్కిలి ప్రేమ ఏచుట్టరికమూ, బంధుత్వమూ లేకున్నా, నోటి మంచితనం వల్ల వాళ్లు చూపే ఆదరాభిమానాలకు అతనికి ఎన్నోసార్లు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

ఈరోజుల్లో ఒకమనిషిని భరించాలంటే మాటలా.

అందులో చంద్రమోహన్ ఒకడు

ఏదో ఆలోచిస్తూ రోడ్డు మీదినడుస్తున్నాడు చంద్ర మోహన్.

సంధ్యా తెరలు పృథ్విని ఆక్రమింకుకొంటున్నాయి.

చాలీచాలని సామాన్య బతుకులా వెలవెలా బోతున్నాయి స్ట్రీటులైట్లు.

# 2

సరికొత్త ఫియటు కారు సడన్ బ్రేక్‌తో ఆగిపోయేసరికి, తత్తరపాటుతో ప్రక్కకు తొలిగాడు చంద్రమోహన్. ఒక్క క్షణం ఆలస్యమైతే నేటితో తనకు నూకలు చెల్లిపోయేవి- అని అనుకుని కారువేపు చూసాడు. ఆ కారు ఎవరిదో కాదు అంతకు ముందు తను ఇంటర్వ్యూలో చూచిన హేమాదేవిది. చిరునవ్వుతో తల బయటకు పెట్టి "ఏమిటంత పరధ్యాన్నంగా నడుస్తున్నారు? పబ్లిక్ రోడ్డుమీద అలా ఆదమరచి నడిస్తే ప్రమాదం జరగదూ?. మందలింపుగా అన్నది ఆమె.

చంద్రమోహన్ సిగ్గుపడిపోయాడు తన పరధ్యాన్నానికి. "క్షమించండి మేడమ్ ఏదో ఆలోచిస్తూ..." అన్నాడు నెమ్మదిగా నొచ్చుకుంటూ.

"సరే—రా ఎక్కడికెళ్ళాలి? నేను డ్రాప్ చేస్తాను— డోరు తెరిచి కారు ఎక్కమన్నది.

చంద్రమోహన్ ఆశ్చర్యపోయాడు. ఇదేమిటి తనను కారులో డ్రాప్ చేస్తానంటుంది? ఇంతకుముందు పరిచయం కూడా లేదు. అయినా తనకెందుకీ ఆడంబరాలు — అనుకుని "ఫర్వాలేదు లెండి దగ్గరే—నేను నడిచి వెళ్ళగలను—" అన్నాడు మర్యాదగా.

"కారు ఎక్కాలంటే ఇబ్బందుగా వుందా? లేక నా పక్కనకూర్చోవడం..." అర్ధోక్తిలోఆగి అతని మోములోకి గుచ్చి చూసింది. ఆమె చూపులకు అతను కలవర పడి పోయాడు.

"అలాంటి దేమీ లేదు మీరు వెళ్ళి రండి"

"మరేమిటి నీకభ్యంతరం? డ్రాప్ చేస్తాను ఎక్కు—" అధికార పూర్వకమైన ఆమె గొంతులో మార్దవకనిపించింది చంద్రమోహన్‌కు. ఇబ్బందిగానవ్వాడుగాని ఏమీ అనలేక పోయాడు.

"ఏమిటి సంకోచం? నీతో మాట్లాడాలి. రా, త్వరగా!" తొందర చేసింది ఆమె.

'నాతో మాట్లాడుతుందా? ఏమిటి మాట్లాడుతుంది?" ఈమె ప్రవర్తన తనకేమీ అర్ధంకావడం లేదు. ఆమెఎవరో, తనెవరో, కొద్దిసేపు ఇంటర్వ్యూలో కలుసుకున్నంత మాత్రాన తనకారులో డ్రాప్ చేస్తానంటుంది! అయినా ఆమెతో తనకు మాట లేమిటి? ఒకవేళ ఉద్యోగ విషయం ఏమన్నా మాట్లాడుతుందా? ఆం... ఇంకెక్కడ ఆశ! ఎవడో తన్నుకు పోనే పోయాడు. మరేంమాట్లాడుతుంది?

"మిస్టర్ ? ఎంత సేపిలానన్ను నడిరోడ్డుమీద నిలబెడ తావు! ఎక్కు త్వరగా" కొంచం విసుగ్గా అన్నది. చంద్ర మోహన్ ధైర్యంచేసి కారు ఎక్కాడు.

ఆమె చిన్నగా నవ్వుతూ కారుస్టార్టుచేసింది. కారు కదులుతునే ఆమె వంటిమీదినుంచి "కునేగా" పరిమళం

గుప్పిన చంద్రమోహన్ నాసికాపుటల్ని చూకింది ఆమె ప్రశ్నకన కూర్చోవడం మహా ఇబ్బందిగావుంది. దిక్కులు చూస్తూ కూర్చున్నాడు.

"ఉద్యోగం గురించేనా ఆలోచన!"

ఆమె ప్రశ్నకు బదులు చెప్పక తప్పలేదతనికి.

"అవును. నాలాంటివాళ్లకు అంతకుమించి ఆలోచన లేముంటాయి" పొడిగాబలవంతాన నవ్వాడు. "వచ్చినవాళ్లందరికల్లా నీవే బాగాచేసావు కానీ" అని ఆగింది

ఆమె ఏంచెబుతుందోనన్నిశితంగాఆమెవేపుచూస్తాడు చంద్రమోహన్.

హేమాదేవి నవ్వి "నేనే నీకు ఉద్యోగం రాకుండా అడ్డుపడ్డాను" అని అన్నది. అదిరిపడ్డాడు చంద్రమోహన్. ఆమె ఎందుకు అలా చేసిందో అతనికేమీ బోధపళ్ళేదు.

"మిగతా మెంబర్సంతా నీకేఇవ్వాలని పట్టుబట్టారు. కానీ, నేనే వాధించిగెల్చిచాను" అతని ముఖం మ్లానమైంది. అదిగమనించి ఆమె నవ్వుకుంది చిన్నగా.

"ఎందుకని అడగవేం?"

"నేను అడక్కపోయినా చెబుతారు. ఇంతచేసినవారు అదికూడా చెప్పకుండా ఎలా వుండగల్గుతారు. అయినా మీకేం ద్రోహం చేసానని ఇలా అడ్డుతిగిలారు?" ఉక్రోషంగా అన్నాడు అతను. అతని రక్తంఉడకిపోతోంది తనకు రావలసిన ఉద్యోగాన్ని పరులపాలు చేసింది. పైగా

ఏదో ఘనకార్యం చేసినట్లు చెబుతోంది—కసిగా వుందతనికి. కానీ ఏం చేయలేకపోతున్నాడు.

"ఉద్యోగం చేయడం నీకు తప్పనిసరా?"

ఆ ప్రశ్నకు అతనికి వళ్ళుమండిపోయింది.

"లేదు మేడమ్ తిన్నది అరక్క, ఏదో ఒకటి చేయాలని"

"చాలా కోపంగా వున్నావు నా మీద—"

"మీ మీద నాకెందుకు కోపం! నా దురదృష్టానికి వగస్తున్నాను."

"బాధ పడకు నీ కోసం మరో మంచి ఉద్యోగం వున్నది.

అతనేం మాట్లాడలేదు, ఆమే తిరిగి అన్నది.

"నీ తెలివితేటలకి, అర్హతకు తగిన ఉద్యోగం కాదది. అందుకే నీకు రాకుండా చేసాను మంచి ఉద్యోగం ఇప్పించాలనుకుంటున్నాను మరినీ వుద్దేశ్యం!"

"మీ మాటలు నమ్మవచ్చా?"

"నమ్మిచూడు నేకే తెలుస్తుంది."

"అయినా నా మీద మీకెందుకింత శ్రద్ధ?"

"అది ఒకొకరి ముఖం చూసినప్పుడు ఏర్పడే భావం వల్ల అలా జరుగుతుంది."

ఆమె మాటలు తనకు విచిత్రంగానూ, వింతగానూ వున్నాయి.

"అయితే చెప్పండి ఎక్కడున్నదో ఆ మంచి ఉద్యోగం?"

"ఇదిగో ఈ అడ్రసుకు రేపువస్తే వివరాలు తెలుస్తాయి" విజిటింగ్ కార్డు ఇచ్చింది.

"తప్పకుండా వస్తానుకదూ! రేపు ఉదయం పదింటికి"

"రాకుండా ఎలా వుండగలను అవసరం నాది" అని నవ్వి "ఆపండి నేను దిగుతాను" అన్నాడు.

కారు ఆగింది చంద్రమోహన్ దిగి ఆమె వద్ద శెలవు తీసుకుని కదిలాడు. అతను దూరంగా వెళ్ళే వరకూ అలాగే చూస్తూవుండిపోయింది హేమాదేవి. ఆమె పెదవులపైన విచిత్రమైన నవ్వు మెరిసి మాయమయింది.

చంద్రమోహను ఇంట్లోకి అడుగుపెడుతూనే దుర్గాంబాయి ఎదురొచ్చింది.

"వెళ్ళిన పని ఏమయింది బాబూ?" ఆత్రుతతో అడిగింది.

"ఇంకా తెలవలేదమ్మా! రేపటికిగాని అసలు సంగతి బయటకు రాదు-" హేమాదేవి చూపిన ఆదరుతలచుకుంటూ అన్నాడు చంద్రమోహను.

"ఏమో బాబూ! ఈసారన్నా నీ ఆశ ఫలిస్తే అంతే చాలు కాళ్లకు బలపం కట్టుకుని తిరుగుతున్నావు. ఆ దేవుడు నీకు మేలుచేస్తాడు. తప్పక నీకు మంచి ఉద్యోగం వస్తుంది. నాకు నమ్మకముంది..."

"నీ ఆశీస్సులు ఫలించాలనే అనుకుంటున్నానమ్మా" ఆప్యాయంగా చూసాడు.

"సరే పద - పొద్దునెప్పుడో నాలుగు మెతుకులు ఆదరాబాదరా తిని వెళ్ళావు వడ్డిస్తాను కాళ్ళు కడుక్కురా" అని వంటగది వేపు కదిలిందామె.

అతను మౌనంగా తన గదిలోకి వెళ్ళి ప్యాంటువిప్పి లుంగీ చుట్టుకుని వచ్చాడు.

"వాహినీ ఇంకా రాలేదామ్మా?" అన్నాడు పీటమీద కూర్చుంటూ.

"లేదు బాబూ! ఏదో నోట్సు రాసుకోవడానికి స్నేహితురాలింటికి వెళ్ళింది. ఏం చదువులో ఏమిటో ఇంతకష్టపడి చదివి చివరకు ఉద్యోగాలు లేక నానా అగచాట్లు పడాల్సి వస్తోంది." అంటూ విస్తరివేసి భోజనం వడ్డించింది. ఇంతలో బజారుకు వెళ్ళిన రామచంద్రయ్యగారు కూడా రావడంతో

"మీరురండి వేడిగా తిందురు" అని భర్తనుపిలిచింది.

ఆయనా భోజనానికి కదిలి వచ్చాడు. చంద్రమోహన్ని ఉద్యోగ విషయం ఏమయిందని పరామర్శించాడు. "ఆదేమిటో బాబాయ్! వాళ్ళ ఉద్యోగం ఇవ్వరని నాకు ముందే

తెలుసు. కాని వెధవ ఆశ వెళ్ళకుండా వుండనీయదు-" చారు కలుపుకుంటూ నవ్వాడు చంద్రమోహన్.

"అదే ఆశ లేక పోతే మానవ జీవితాలు మహా దుర్భరంగా వుంటాయి బాబూ- నిరాశా నిట్టూర్పులతో బ్రతకడం మధ్య తరగతి మనిషికి అలవాటయిపోయింది. పోనీలే, మరొకటి ఇది కాక పోతే-" అని అన్నాడు రామచంద్రయ్య వేదాంత ధోరణిలో.

చంద్రమోహన్ భోజనం ముగించుకుని-తన గదిలోకి వచ్చాడు.

ఏదో చదువుదామని పుస్తకం తెరిచాడు. అతనికి హఠాత్తుగా హేమ దేవి గుర్తుకువచ్చి ఆలోచనలు ఆ వేపున పయనించాయి.

"ఆమె ప్రవర్తన వింతగా వుంది. తన మీద ఏదో ప్రత్యేకమైన శ్రద్ధ చూపుతుంది దేనికి? ఏ ప్రయోజనమాశించి అలా చేస్తుంది? నిజంగా తనకు ఉద్యోగం చూసిపెట్ట గలదా? ఆమెకు బాగా పలుకుబడి, డబ్బువున్నది. అనుకుంటే వేయించగల స్తోమతు వుంది. మరేం చేస్తుందో చూడాలి. ఏది ఏమైనా తనకు ఉద్యోగం కావాలి. అది ఎలాంటిదైనా సరే! తన కాళ్ళ మీద తను నిలబడాలి. రేపు తప్పక పదింటికి కల్సి ఆమె చెప్పిన అడ్రసుకు వెళ్ళాలి—' అనినిర్ణయించుకున్నాడు.

"అన్నయ్యా! ఈ లెస్సన్ అర్థం కావడం లేదు. కాస్త వివరించవ్వూ?" ఇంగ్లీషు పుస్తకం పట్టుకునివచ్చింది వాహిని ఆమె ఇంటర్ చదువుతోంది.

"భోజనం చేసావా వాహినీ?" అని అడిగాడు.

"ఆఁ... ఇప్పుడే చేసి వస్తున్నాను..." పుస్తకం అందించింది.

చంద్రమోహన్ పుస్తకాన్ని అందుకుని "ఏ లెస్సన్?" అడిగాడు.

బుద్ధుని పాఠం—"

"బోధిసత్వుడిదా? అదేమిటమ్మా బుద్ధిని పాఠం అర్థం కాలేదా! చిన్న తరగతుల్నించి వస్తున్న పాఠమేగా?"

"ఏమో కొంచం అయోమయంగా వుంది-"

"నీవు చదువు. ఎక్కడ అర్థం కాలేదో అడుగు చెబుతాను-" పుస్తకం ఆమెకి ఇచ్చాడు. వాహిని తల గోక్కుని "నిజం చెప్పమంటావా అన్నయ్యా! పాఠం అర్థంకాక కాదు. ఎందుకో నీ నోటిగుండా ఆ కథ వినాలని వుంది. నీవు చాలా చక్కగా హృదయానికి హత్తుకునేలా చెబుతావు. ప్లీజ్ ఆ కథ చెప్పవ్వూ? మా మంచి అన్నయ్యవుకదూ..." అతని గడ్డం పుచ్చుకుని ప్రతిమాలింది

"ఆఁ... మునగ చెట్టు ఎక్కించకు. అలాగే చెబుతాను. బుద్ధుని కథ మొదటినుంచి జనరల్‌గా చెబుతాను. అందులో మీ లెస్సన్ ఏ భాగానిదో నీవు అర్థం చేసుకోవాలి."

"అలాగే." శ్రద్ధగా తలాడించి సర్దిగా కూర్చున్నది వాహిని.

ఆమె ఆసక్తికి అబ్బురపడ్డాడు చంద్రమోహన్.

ఒక్కసారి బుద్ధుని రూపాన్ని సుగుణాల్ని తలచుకుని మొదలెట్టాడు.

గౌతమ బుద్ధుని కథ వింటుంటే వాహిని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. ఆ కథలోని సన్నివేశాలకన్నా చంద్రమోహన్ వర్ణించి చెబుతున్న కథనం తీరు ఆమె హృదయానికి హత్తుకుంది.

"మానవుని దుఃఖానికి కారణమేమిటి? సుఖాన్ని దూరం చేసుకోలేక, ఆశల్ని పెంచుకుంటూ ఫలించక ఎందుకలా బాధపడిపోతున్నాడు? అనే ప్రశ్నలు ఆయనలో తలెత్తాయి. వాటిని తెలుసుకోవాలన్న జిజ్ఞాసతో రాజ్యాన్ని, ఆలు బిడ్డల్ని వదిలి వెళ్ళిపోయాడు. ఎన్నో గ్రంథాలు చదివాడు. యెన్నో విషయాల్ని ఆకళింపు చేసుకున్నాడు, చివరకతనికి బుద్ధగయ అనే చోట జ్ఞానోదయమైంది. మానవుని సుఖ దుఃఖాలకు హేతువు కోరికలే! వాటిని నశింపజేసుకున్న శాశ్వత ఆనందాన్ని పొందగలడనే సత్యాన్ని లోకానికి వెల్లడించాడు."

"అయితే అన్నయ్యా మనిషి ఆశలు పెంచుకోవడం వ్యర్థమంటావా" అని ప్రశ్నించింది వాహిని.

"అసలు ఆశలేని మానవుడు లేడు. బుద్ధుడు చెప్పిన ఆశలు. కోరికలు, అనేవి అత్యాశలు అతి కోరికలే! అంటే! మనిషి తన తహతుకుమించిన కోరికలు కోరకూడదని, ఉన్న

దానిలోనే తృప్తిని వెదుక్కోవాలి. అందనివాటి కోసం అర్రులు చాచకూడదు. యెంతవున్నా, ఎన్ని వున్నా తృప్తి లేని మనిషి నరకాన్ని చవిచూస్తాడు. కాబట్టి ఆశ అనేది మానవసహజం. తగు మోతాదులో ఆశను పెంచుకుని వాటిని సాధించేందుకు తగిన కృషి చేయాలి, ఆశల సిద్ధికోరకు పాటుపడాలి. శ్రమించాలి. ఉదాహరణకు మనమేవున్నాం, ఒక్క రూపాయి పెట్టి లాటరీ టిక్కెట్టు కొన్నాం అనుకో, ఆ లక్ష లన్నీ మనకే రావాలని, వస్తాయని కలలు కనడం అవివేకం. అదే మనం చదివిన చదువుకు తగిన ఉద్యోగం రావాలని, వస్తుందని ఆశించడం ధర్మం. జీవనోపాధికై అలంబన అవసరం. కాదా?"

వాహిని ఆసక్తిగా అతను చెప్పే విషయాల్ని ఆకళింపు చేసుకుంటోంది.

"నాదో చిన్న సందేహం!"

"ఏమిటమ్మా అది?"

"గౌతమ బుద్ధుడు అలా చేశాడంటే నమ్మలేకుండా వున్నాను. సిరిసంపదల్ని, భార్యాభర్తల్ని వదిలేసి వెళ్ళిపోయాడే అదే మామూలు మనిషి చేయగలడా."

"గౌతమ బుద్ధుడు పెరిగిన వాతావరణం వేరు, అతనిది సున్నితమైన మనస్సు చాలాకాలంవరకు అసలు దుఃఖాన్నే చూసి ఎరగడు. అందుకే ఒక్కసారిగా ఈ ప్రపంచాన్ని, దుఃఖమయమయిన జీవితాన్ని చూచేసరికి అతను చలించి పోయాడు. ఆయనతో మనం పోల్చుకోకూడదు ఆయన

చెప్పిన విషయాన్ని ఆకళింపు చేసుకుని నడవాలేగానీ, ఆయ నిలా నడవమని కాదు అర్థమయిందా."

"ఏమో అన్నయ్యా! నీవు ఎన్నయినా చెప్పు! బుద్ధుడు చేసిన పని నాకేం నచ్చలేదు" పెదవి విరుస్తూ అన్నది వాహిని.

"అదేమిటి?"

"లేకుంటే రాజ్యాన్ని వదిలేసి పోవడం ఏం బావుంది. అందులో అతను పెళ్ళయినవాడు, అతను వెళ్ళిపోయినప్పుడు అతని భార్య ఎంతగా వగచిందో, తన స్వార్థం తను చూసుకున్నాడేగానీ, కట్టుకున్న భార్యను గురించిగానీ, రక్తంపంచుకు పుట్టిన బిడ్డను గురించిగానీ యోచించలేదు"

"వాళ్ళకేమీ లోటుచేయలేదుగా"

"సిరిసంపదలు వుండగానే ఆడది తృప్తిపడుతుందా? కట్టుకున్న భర్త ఆప్యాయతకు నోచుకోని ఆడదాని జీవితం చాలా దుర్భరం. ఆమె కాబట్టి ఓర్చుకోగలిగింది. అదే ఈ యుగంలో ఏ ఇల్లాలు, తనభర్త అలా సన్యాసుల్లో కలు స్తుంటే చూస్తూ ఊరుకోదు."

"సరేలే! ఇక ఆ విషయం మర్చిపోదాం. చాలా లోతుకుపోతున్నాం" అని ఆవలించి "నాకు నిద్రవస్తుంది. వాహిని ఇక చాలు వెళ్ళు" అని అన్నాడు అతడు.

"అయినా ఈ విషయాన్ని ఇంతటితో వదలను. మరో సారి బుద్ధుని జీవితచరిత్ర మొత్తం చదివి నీతో వాదనకు దిగుతాను" అని నవ్వింది వాహిని.

"అలాగే ముందు పరీక్ష కానీ" అని తానేసినవ్వాడు చంద్రమోహను.

రాత్రి సదిదాటింది. ఊరంతా నిశ్శబ్దం అలుముకో సాగింది.

చంద్రమోహన్ హేమాదేవిని గురించి ఆలోచిస్తూ నిద్రలోకి జారుకున్నాడు.

ప్రక్క గదిలోవున్న వాహినికిమాత్రం నిద్రరావటం లేదు.

ఆమె మెదడు బుద్ధుని గురించే ఆలోచిస్తుంది.

"ఈ కధలు, నీతులు వినడానికి బావుంటాయి కానీ యెంతవరకు ఆచరణ యోగ్యమైనవి? కాబట్టి ఆ దుఃఖాన్ని యశోదర సహనంతో భరించింది. అదే తను అయితేనా ఏమిటీ పాడుప్రూహా, తనకుపెళ్లి కానిదే-కృష్ణ ఎలావున్నాడో తనంటే ప్రాణం పెడతాడు. అతడు పాటలు ఎంతచక్కగా పాడుతాడు చాలా మంచివాడు"

కృష్ణ మీాదికి మళ్ళాయి తలపులు. అతన్ని తలుచు కుంటే ఆమె హృదయం తీయగా అలాపన చేసింది.

# 3

ఇంద్రభవనంలా వెలిగిపోతున్న ఆ భవనాన్ని చూసి అచ్చెరువు నొందాడు చంద్రమోహన్. అధునాతనంగా కట్టబడి చుట్టూ ఎత్తయిన ప్రహరీ, మధ్య పూల మొక్కలు లాన్, దారికిరువైపులా ఎత్తుగా టీవీగా పెరిగిన క్రోటన్స్, చాలా అందంగా, కన్నుల పండువుగానున్నది ఆ భవనం. అతడు ఊహించినదానికంటే రెట్టింపు హోదాను వెలిబుచ్చుతున్నది. అడ్రసును మరోసారి చూసి, తాను కలవవల్సింది ఈ భవనంలోనేనని నిశ్చయించుకుని నెమ్మదిగా గేటు తెరుచుకుని లోనికి దారితీసాడు. మెత్తని కార్పెటు మీద నడుస్తుంటే అతనికి వింతగానూ, కొత్తగానూ వుంది.

ఇల్లంతా నిశ్శబ్దంగా వున్నది. మనుషులెవరూ బయట కనిపించలేదు. కొన్ని క్షణాలు తటపటాయిస్తూ వాకిట్లోనే నిలబడిపోయాడు. ఐదు నిమిషాలు గడుస్తున్నా ఎవరూ బయటకు రాలేదు. అప్రయత్నంగా అతని దృష్టి కాలింగ్ బెల్ మీద పడింది. "అరే ఇందాకటనుంచీ గమనించలేదే" అనుకుంటూ స్విచ్ నొక్కాడు. మరో నిమిషం తరువాత ఓ అరవై ఏళ్ళ వృద్ధ స్త్రీ బయటకు వచ్చింది. "ఎవరు కావాలి బాబూ?" అని అడిగింది. ఆమె ఆ ఇంట్లో నౌకరు పేరు సీతమ్మ.

"హేమాదేవిగారు వున్నారా?" సందేహంగా అడిగాడు చంద్రమోహన్.

"పైన వున్నారు. మీరు ఎవరో చెబితే వెళ్ళి చెప్పి వస్తాను" అని అన్నది సీతమ్మ.

అతడు బుర్రగోక్కుని "మీ కోసం యెవరో వచ్చారని చెప్పు" అని అన్నాడు. అతనికేసి విచిత్రంగాచూసి ఏమనుకున్నదో చిన్నగా నవ్వుకుంటూ పైకి వెళ్ళిపోయింది సీతమ్మ. కొన్ని క్షణాలతర్వాత హేమాదేవి నక్షత్రప్రభలా వెలిగిపోతూ, చిరునవ్వులొలకబోస్తూ మెట్లుదిగి వచ్చింది.

"అరే నిలబడే వున్నావే-పైకిరా నీ కోసమే ఎదురు చూస్తున్నాను. సీతమ్మ టిఫిన్ తీసుకురా పైకిపోదాంరా" చక చక మాట్లాడేస్తూ అతడ్ని పైకి ఆహ్వానించిందిఆమె.

అతడు మౌనంగా ఆమెను అనుసరించాడు.

ముందు ఆమె నడుస్తుంటే వెనకగా అతను. ఆమెనడకలో హంస హొయలు, ఆమె విరుపుల్లో చిత్రమైన మెరుపులు, ఆమె నవ్వుల్లో కాంతిపువ్వులు, అదోవింత అనుభూతిలా వున్నది అతడికి.

"ఇదే నా గది" కుర్చీ చూపించింది. ఆసీనుడయ్యాడు

"వస్తావో రావో ననుకున్నాను ఫర్వాలేదు. టైమ్ కరెక్టుగా మెయిన్ టేన్ చేయగలవు" చిన్నగా నవ్వుతూఅన్నది ఆమె.

అతడుకూడా నవ్వి వూరుకున్నాడు. సీతమ్మ కాఫీఫలహారాలు తెచ్చింది. అతడు వద్దంటున్నా వినకుండా

"ఫర్వాలేదు తినవయ్యా! వయసులోవున్న కుర్రవాడివి. ఆ మాత్రం తినకపోతే ఎలా?" అని బలవంతాన తినిపించింది.

"మీరింత మర్యాద చేస్తున్నారు. ఎందుకో అర్థం కావడంలేదు. మీ మర్యాదల్ని పొందే అర్హతనాకున్నదో లేదో ఆలోచించారా?" ఆమె ఉద్దేశ్యమేమిటో తెలీక అన్నాడు.

ఆమె బదులు పలకలేదు. కానీ నవ్వింది సుతారంగా.

ఆ నవ్వులో ఏదో వెతుక్కోబోయాడు అతడు కానీ, ఆమె అడ్డు తగిలింది.

"చెప్పు-ఏమిటి ఆలోచించావ్!"

"ఆలోచించడానికి ఏముందండీ? మీరు ఉద్యోగ మిప్పిస్తానంటే రెక్కలు కట్టుకుని వాలేను. యిక చెప్పాల్సింది మీరు–" తేలికగా నవ్వాడు అతడు.

"నీకు ఉద్యోగం ఖాయమయింది. జీతమెంత కావాలి"

"ఎంత ఇచ్చినాసరే? నాకు ఉద్యోగం కావాలి"

"అయితే ప్రస్తుతానికి ఐదు వందలు యిస్తాను సరిపోతుందా?"

"ఆ మాటలకు అతనికళ్ళు మెరిసాయి. "ఏమిటి ఐదు వందలే."

"ఎందుకంత ఆశ్చర్యపోతావ్? చాకులాంటికుర్రవాడివి కష్టపడిపనిచేసేలా వున్నావు? నీకు ఐదువందలు యివ్వడం పెద్ద లెక్కలోనిది కాదు—"

"థ్యాంక్స్ అండీ! మీరు చూపుతున్న అభిమానా నికి ఎలా కృతజ్ఞతలు చెప్పుకోవాలో తెలీడంలేదు-" ఆ తరువాత సంతోషంతో మాటలు కరువయ్యాయి అతనికి.

"అట్టే పొగడకు, ముందుముందు కృతజ్ఞతలు చెప్పుకునే సమయం వస్తుంది" అని గుంభనగా నవ్వింది ఆమె.

ఇంతలో ఫోను మ్రోగటంతో వెళ్ళి రిసీవరెత్తింది. ఏదో మాట్లాడేసి "చూడుమిస్టర్ ఓ పదినిముషాలు వెయిట్ చేయి, నేను వచ్చేస్తాను. కొంచం అర్జంటు పని తగిలింది." అని అన్నది.

"అలాగే వెళ్ళిరండి. మీరు వచ్చేదాకా వుంటాను. నాకు వేరేపనికూడా లేదు."అని అన్నాడుఆమె వెళ్ళిపోయింది

చంద్రమోహన్ వంటరిగా ఆగదిలో కూర్చొని ఆ ఇంటిని ఆమె క్యారెక్టర్ని ఆఇంట్లోఇంకెవరున్నారోనని ఆలోచనలలో తలపోస్తూ కూర్చున్నాడు. చాలా హుషారుగా వున్నాడు. వుండదుమరి ఎన్నో రోజులనుండి ఎదురు చూసిన ఉద్యోగం అతి సునాయాసంగా లభ్యమయితే ఆనందంగా వుండదు.జీతంఐదువందలు తలచుకుంటేనే ఆశ్చర్యంగావున్నది తను కలలోకూడా వూహించలేదు. ఆమె చెబుతుంటే నమ్మశక్యం కాకున్నది. ఏది ఏమయితేనేం నేటితో కష్టాలు గట్టెక్కాయి. నేనూ మనిషినే అని తలెత్తుకుని టీవిగా తిరగవచ్చు. అంతాబాగానేవుందిగానీ వుద్యోగం ఎక్కడో చెప్పలేదు. ఏంపనిచేయాలోకూడా చూచాయనగాకూడా చెప్పలేదు. ఏమయితేనేం, పనిచేసేవాడికి ఏదైనాఒక్కటే. నిన్న

టికి ఈరోజుకీ ఎంత తేడా? ముందు ఈవిషయం అమ్మకి చెప్పాలి. ఆమె కళ్ళల్లో కదలాడే ఆనంద రేఖల్ని చూడాలి. కన్నతల్లి ప్రేమకుదూరమయిన తనను బిడ్డమాదిరి పెంచుతుంది. ఏజన్మ బంధమో తెలీదు. ఇలా ఆలోచనా స్రవంతిలో కొట్టుకుపోతూన్న అతడు, ప్రక్కగదిలో ఎవరో ఏడుస్తున్నవినికిడై ఆశ్చర్యంతో తేరుకున్నాడు.

"ఎవరా ఏడ్చేది? ఎందు కేడుస్తున్నట్లు?" అర్థంగాక లేచి వరండాలోకి వచ్చాడు.

ప్రక్కగది తలుపులు మూసి వున్నాయి. స్పష్టంగా ఏడుపు ఆగదిలోంచేవినిపిస్తుంది. అది ఓస్త్రీకంఠం కొద్దిసేపు అలాగే నిల్చుండిపోయాడు. క్షణక్షణానికి ఆమె దుఃఖం పెరుగుతుందే కాని తరగటం లేదు ఉండివుండి తలచుకుని, తలచుకుని ఏడుస్తున్నట్లుంది. మధ్య మధ్య వెక్కిళ్ళు వింటున్న చంద్రమోహన్‌కి కాలునిలువలేదు. ధైర్యంచేసి తలుపువద్దకు వెళ్ళి తలుపు తట్టాడు. లోపలినుంచి జవాబురాలేదు. ఏడుపు ఆగలేదు.

"ఎవరండీ లోపల—"

"——"

"పిలిస్తే పలకరేమండీ— ఎందు కేడుస్తున్నారు? తలుపు తీయండి" కొంచం గట్టిగా అరుస్తూ తలుపు దబదబ బాదాడు. ఈసారి ఏడుపు ఆగిపోయింది. కొన్నిక్షణాల తరువాత తలుపు తెరుచుకుంది.

తలుపు తెరచినస్త్రీని చూసి అదిరిపడ్డాడతడు.

ల్లగా స్ఫటికపుముచ్చులతో అందవిహీనంగావున్నది. పైగ
ండు కాళ్ళూ వంకర్లు తిరిగి పోయివున్నాయి. వీల్ ఛైర్ ని
ంచం దూరంగా జరుపుకుంది. ఆమె కళ్ళల్లోని బెదురు
ాసి విస్తుపోయాడతను ఏంమాట్లాడాలో అర్థంకానివాడివలె
క్కిల్లబోయి నిల్చుండి పోయాడు.

"యెవరుమీరు? ఏంకావాలి? చిన్నగా, బెరుగ్గా
పశ్నించింది ఆమె.

అతడు కొంచెం సర్దుకుని "ఏంకాదు-యెవరికో ఏడుపు
నిపి స్తేను." అన్నాడు పొడిపొడిగా.

"మీరు పొరబడివుంటారు. ఇక్కడ యెవరూ అలాంటి
ుదృష్టవంతులు లేరు-"

ఆమెనే పరిశీలనగా చూసాడు. అంతవరకూ ఏడ్చినది
మేనని, ఆమె కళ్ళే చెబుతున్నాయి. ఆవిషయం అతనికి తెలీ
ంఇష్టంలేం ఆమె అలా అంటున్నదని గ్రహించాడు.

"క్షమించండి-నేనే పొరబడివుంటాను-"అని చకచకా
మెట్లుదిగి క్రిందకివచ్చాడు అతడు. అక్కడ సోఫాలో కూర్చుని
ుదుటికిపట్టిన చెమటను కర్చీఫ్ తో అద్దుకున్నాడు.

పదినిమిషాలు గడిచాయి. హేమా దేవి రాలేదు. ఒంట
గాకూర్చోవడం అతడికి ఇబ్బందిగావున్నది. సీతమ్మ అటుగా
ావడంచూసి "కొంచెం మంచినీళ్లు కావాలి-" అన్నాడు
మెను మాటల్లోకి దింపుతూ గ్లాసునిండా ఐస్ వాటర్ తెచ్చి
చ్చింది సీతమ్మ.

ఖాళీ గ్లాసుతీసుకు వెళుతున్న ఆమెను ఆపి "జూడమ్మా
నేనిలా అడుగుతున్నానని కోప్పడకు. పైన మేడమీదగదిలో

యెవరో ఏడుస్తూవున్నది. యెవరామె?" అని అడిగాడు నెమ్మదిగా.

"ఎవరూ ? సుజాతమ్మగారా ఏడుస్తున్నారా? పాపం ఆయమ్మ బతుకే యేడుపు అయిపోయింది. యెంవరుచెప్పిన వినకోదు-ప్చ్! ఇంతసిరి సంపదలుండి కూడా అనుభవించేందుకు ప్రాప్తం లేదు—వస్తాబాబు-" అని వెళ్ళిపోయింది.

చంద్రమోహన్ సీతమ్మమాటల్ని మననం చేసుకుంటూ కూర్చున్నాడు.

"పాపం.ఆమెదెంత దుర్భలమైన బతుకు? కురుపితనానికితోడు దేవుడు రెండు కాళ్లూ లేకుండా చేసాడు ఆమెకు, ఈ ఇంటికీ యేదే సంబంధముండితీరాలి. హేమాదేవికి ఆమె యేమవుతుందో?దగ్గరి బంధువో-లేక కూతురో కావచ్చు. అవును హేమాదేవికి పెళ్ళయినట్లు కనిపించదే, పెళ్ళయితే అలావుండదు. ఎవరులేరు ఇంట్లో,ఆమె ప్రవర్తన ఆతీరు పెళ్ళయిన దానికిమల్లే లేవు. అయినా ఇవన్నీ తనకెందుకు?త్వరగా ఆమెవస్తే బావుండును. విషయం మాట్లాడేసి పోవచ్చును-" అని మీనమేషాలు లెక్కిస్తూ కూర్చున్నాడు.

కొద్దిసేపటికి కారుహారన్ వినిపించగానే ఆశ లేచి బయటకువచ్చాడు కారులోంచి హేమాదేవి పాటు,ఓ ఫుల్ సూటులోవున్నవ్యక్తి దిగాడు.

హేమాదేవి, చంద్రమోహన్ని చూచి "చూడు, నాకు కొంచెం అర్జెంటు పన్లుతగిలాయ్. సాయంత్రం కలువు తీరికగా మాట్లాడుతాను. కమాన్ మిస్టర్ షతీ!" అని అంటూ ఆ సూటువ్యక్తి కి చేయి పుచ్చుకుని మేడమీాదకు వెళ్ళిపోయింది.

చంద్రమోహన్ ఉస్సురంటూ నిట్టూర్చాడు. 'ఏమిటీ మనిషి ఎవరతను? పది నిమిషాల్లో వస్తానని వెళ్ళి అర్ధగంటకు వచ్చింది ఎవర్నో వెంటబెట్టుకుని. ఎవరతను? ఆమెకూ ఇతనికీ ఏమిటి సంబంధం? అంత చనువుగా చేయిపట్టుకుని తీసుకెళ్ళింది. ఈమె మనస్తత్వం చిత్రంగా వుంది.

ఇంతకూ ఈమె మాటలు నిజమేనా! అబద్ధం చెప్పి తన చుట్టూ తిప్పుకునే ఖర్మ ఆమె కెందుకుంటుంది? సరే, సాయంత్రం రాక తప్పదు అని తిరుగుముఖం పట్టాడు చంద్రమొహన్.

# 4

ప్రక్క గదిలోంచి వినవస్తున్న నవ్వులకు-అరుపులకు సుజాతకు కంపరం కల్గిస్తున్నాయి. గంటసేపటినుంచి భరిస్తోంది ఆ గోల. ఇక ఉగ్గపట్టుకోలేకపోయింది. అసహ్యాకరమయిన వాళ్ళ సంభాషణ వినలేకపోతోంది. వీల్ చైర్‌ని జరుపుకుంటూ వచ్చి "అత్తయ్యా! అత్తయ్యా!" అని తలుపు మోదింది లోపల గదిలో శృంగార క్రీడలో మునిగివున్న

హేమాదేవి ఆ అరుపులకు అదిరిపడ్డది. పతి కౌగిట్లోంచి బయటపడి చీరె సర్దుకుని తలుపు తీసింది.

“ఏమిటి సుజా! ఏం కావాలి?” సౌమ్యంగా అడిగింది తలుపు సందులోంచే తల బయటకు పెట్టి.

“ఏమిటే గోల? ఇది ఇల్లా లేక సానికొంపా?” కోపంతో సుజాత ముఖం జేవురించింది. హేమాదేవి ఏం తక్కువ తినలేదు. “ష్ ... గట్టిగా అరవకు- అవతల పెద్ద మనిషి వున్నాడు” మందలింపుగా అన్నది.

‘పెద్దమనిషి ఛీ...’ పళ్ళు కొరుక్కుంది సుజాత.

“ఇన్నేళ్ళొచ్చాయి సిగ్గూ శరం లేకుండా ఏమిటా పకపకలు?”

“ఏమిటే నీ గొడవ? అయినా నీకెందుకీవన్నీ?” ముఖం మాడ్చుకుంది హేమాదేవి.

“నాకు కాక ఇంకెవరికి కావాలి? కాళ్ళతో పాటు చెవులు, కళ్ళు కూడా పోయింటే బావుండేది. రోజూ యీ దురవస్థ తప్పేది. నీ విలా అడ్డమైన వాళ్ళందర్నీ ఇళ్ళల్లోకి తీసుకురావడం నేను ఇక సహించలేను. ఈ క్షణమే అతన్ని బయటకు పంపేయ్.

“ఏమిటే నీ బోడి పెత్తనం! నేను తిరుగుతాను నా ఇష్టం. అంతగా చూసి ఓర్వలేకపోతే మెట్లమీదనుంచి పడి చావు. వైధవ ముఖం వేసుకొని, పతివ్రతలా నీతి బోధిస్తున్నావు- అవతలకు వెళ్ళు. నా స్వవిషయాల్లో తల

మార్చితే బాధపడను. ఇదే ఆఖరి వార్నింగు..." చర్రున తలుపు వేసుకుంది హేమాదేవి.

సుజాత ఖిన్నురాలైంది. తన నిస్సహాయతకు కుమిలి పోయింది.

సుజాత దురదృష్టవంతురాలు. తల్లిదండ్రులు చిన్నప్పుడే పోయారు. పోలియో వ్యాధితో కాళ్ళు, మనోవ్యాధితో వికారమయింది. అప్పటినుండి ఇప్పటివరకూ చీకటి బ్రతుకే బ్రతుకుతుంది. తన రూపాన్ని ఎవరికీ చూపించలేక, ఒంటరి తనంతో విసిగిపోతూ వేగిపోతూ కాలాన్ని అతి భారంగా మోస్తుంది.

పైగా హేమాదేవి ప్రవర్తన సుజాతకు కంటకంగా తయారయింది.

రోజుకో పురుషుడ్ని వెంటబెట్టుకుని వస్తుంది. తప్ప తాగి నానా అల్లరి చేస్తూ ఇల్లంతా చిందులు తొక్కుతుంది సుజాత అదేమని నోరు తెరిస్తే ఇష్టమొచ్చినట్లు తిట్టిపోస్తుంది. ఆ స్తిపాస్తులు, ఆ సిరిసంపదలు అన్నీ సుజాతవే సుజాత అనుభవించలేనివి అనుభవిస్తూ చూడలేనివి చూస్తూ, పొందలేనివి పొందుతూ, జీవితాన్ని ఖుషీగా గడిపేస్తుంది. చిన్నతనంలోనే భర్తపోయి పుట్టింటికిచేరింది హేమాదేవి. అన్నా వదినలు పోతూనే పెత్తనం చేచిక్కించుకుంది. అందంగా ఆనందంగా జీవితాన్ని అనుభవిస్తోంది. నీతి నియమాల్ని ఏనాడో వదిలేసింది.

అభిమానవతి అయిన సుజాతకు ఈ చేష్టలు నచ్చటం లేదు. చేసేదేంలేక, తనలో తాను కుమిలిపోతూ వున్నది సుజాత. తన బాధను పంచుకునేందుకు తోడులేరు. సీతమ్మ తప్ప తనకెవరూ లేరు. సీతమ్మ అన్నీ చూస్తుంది.

జీవితం ఒకరికి శాపమయితే—మరొకరికి వరప్రసాదమవుతుంది.

ఏ సుఖాలకు నోచుకోని సుజాత ఎదుటే హేమాదేవి అలా విచ్చలవిడిగా తిరగటం అమానుషమే. స్వార్థం మనిషి చేత ఎంత పనయినా చేయిస్తుంది.

"భగవంతుడా నన్నిలా సగం చంపి నామీద పగ తీర్చుకుంటావా? ఎందుకుస్వామి నాకీ అవిటితనం, అందవిహీనం? ఏజన్మ పాపమిది? ఈ జీవితాన్నుంచి దూరమయ్యే పాటి ధైర్యం కూడా లేదు. ఈ చీకటి బ్రతుక్కి విముక్తి ప్రసాదించు తండ్రీ. నాకీ భోగభాగ్యాలు వద్దు. నన్ను నీలో చేర్చుకో...మరుజన్మలోనైనా మంచిగా పుట్టి నీకు బంగారు పూలతో పూజచేస్తాను" అని కనిపించని దైవాన్ని కన్నీళ్ళతో వేడుకుంది సుజాత.

# 5

గేటు తెరుచుకుని లోనికి రాబోయినవాడల్లా ఆగిపో యాడు చంద్రమోహన్.

లాన్‌లో కూర్చుని తదేకధ్యానంతో ఎగిరే పిట్టలను, ఊగే కొమ్మలను, విరిసిన పూలను చూస్తుంది సుజాత. సీతమ్మ సాయంతో ప్రతిరోజూ ఓ గంట అక్కడ కూర్చుని ఆ అనిర్వచనీయమైన ఆనందాన్ని పొందుతుంది. అంతకు మించి మరో అనుభూతిగాని, ఆనందంగానీ లేదు ఆమె జీవితంలో. అందుకే ఆ పువ్వుల్నీ, కొమ్మల్నీ, రెమ్మల్నీ, పక్షుల్నీ తదేకదృష్టితో చూస్తూ వుంటుంది. అందులో ఆమెకు తృప్తి, ఆనందమూ లభ్యమవుతాయి. పైకి వెళ్ళబోయిన వాడల్లా ఆమెను చూసి ఆగిపోయాడు అతను.

ఆమె గమనించలేదు అతని రాకను. సన్నగా పాడి దగ్గు దగ్గాడు. ఆమె తలతిప్పి అతన్ని చూసింది— "ఏం కావాలి?" తొణక్కుండా అడిగిందామె.

"హేమాదేవిగారున్నారాండీ?"

"లేదు! బయటకెళ్ళింది..." క్లుప్తంగా జవాబిచ్చి తల తిప్పేసుకుంది.

"అలాగా! నన్ను రమ్మని చెప్పిందే" అని స్వగతంగా అనుకుని "ఎప్పుడొస్తారండీ?" అని పైకి అడిగాడు.

'తెలీదు' ఆమె జవాబులు అంటీముట్టనట్లున్నాయి ఇక ఆమెనేమీ అడిగి ప్రయోజనం లేదనుకుని వెనుదిరిగాడు. గేటు దాటి రోడ్డుమీదకు వస్తూనే హేమాదేవి కారువచ్చి ఆగింది. నవ్వుతూ దిగింది.

"హాయ్! చంద్రమోహన్ వెళ్ళి పోతున్నావేమిటి?"

"మీరు లేరంటేనూ—"

"ఎవరు సుజాత చెప్పిందా? అది అలాగే చెబుతుంది లేండి ఎవరొచ్చినా పద ఇంట్లోకి—"అని లోనికి వచ్చింది

సుజాతనుగమనించి "అదేమిటి సుజా! ఇంటికొచ్చిన వారిని మర్యాదచేయవ్- నీకు చెప్పే వెళ్ళాగా, నాకోసం ఎవ రన్నా వస్తే వెయిట్ చేయమని"

సుజాత మాట్లాడలేదుగానీ, తీవ్రంగా చూసింది.

ఆచూపులకు చంద్రమోహను కలవరపడి పోయాడు. అదేమిటి ఆ చూపులంత తీవ్రంగా వున్నాయి. తనిక్కడకు రావడం ఆమెకు ఇష్టంలేనట్లుంది. అని అనుకున్నాడతను.

'కూర్చో చంద్రా! యిప్పుడే వస్తాను'. అని లాన్‌లో కుర్చీ చూపించి పైకి వెళ్ళిపోయింది హేమాదేవి.

చంద్రమోహన్ కూర్చున్నాడు. కొంచం దూరంలో ఆమె కూర్చొనివుంది.

పరధ్యానంగా అతడు ఏదో ఆలోచిస్తూ వుండి పోయాడు. సుజాత ప్రశ్నకు తేరుకున్నాడు.

'మీకు మరో పని లేదా?'

"ఎవర్ని మీరు ప్రశ్నించేది నన్నా!" విస్తుబోయాడు అనుకోని ఆమె ప్రశ్నకు.

"అవును మిమ్మల్నే అడుగుతున్నాను. పని పాటలు లేకుండా యెందుకిలా పూట పూటకూ తిరుగుతున్నారు? ఆమెకు లేకపోయినా మీకయినా ఉండక్కర్లా సిగ్గు!" కోపంతో సుజాత ముఖం జేవురించింది. అతనికేమీ అర్థంకాలేదు. కానీ, నిష్ఠూరమయిన ఆమె మాటలకు అభిమానం చివ్వున తలెత్తింది.

"మీరు పొరబడుతున్నారు. పని లేక నేమీ ఇంటిచుట్టూ తిరుగుతున్నాను? ఉద్యోగ ప్రయత్నంలో రాక తప్పడంలేదు. యిందులో సిగ్గుపడాల్సిన పనేమిటి!"

"ఉద్యోగమా? ఆమె యిప్పిస్తానని చెప్పిందా!"

"అవును అందుకే వచ్చాను..."

ఆమె మౌనంగా యేదో ఆలోచిస్తూ వుండి పోయింది, అతనికి కొంచం కష్టంగావుంది. ఈకలవారితో మాట్లాడటం. వారితోతిరగటం సామాన్యునికి లేనికష్టాలు' అవమానాలు కల్గక తప్పవు. అయినా ఉద్యోగం కోసం తప్పవు ఈ పాట్లు అనిఅనుకున్నాడు.

ఇంతలో సీతమ్మ చేత టీ కలిపించుకునితీసుకు వచ్చింది హేమాదేవి.

"తీసుకోచంద్రా!" అంటూ అతనికో కప్పుఇచ్చి, సుజాతకు కప్పుఅందించి తానూతీసుకుంది.

"మర్చిపోయాను. ఈమెను పరిచయం చేయడం లేదు కదూ"అని నవ్వి ఈమె సుజాత నామేనకోడలు. పాపం దుర దృష్టంవల్ల చిన్నప్పుడే కాళ్ళు రెండూపోయాయి. అప్పటినుండీ ఈ అవిటిబ్రతుకు శాపంగా మోస్తుంది." అని సానుభూతిగా అన్నది.

అత్తయ్య ఎందుకలా తననుగురించిహీనంగాపరిచయం చేస్తుందో తనకు తెలుసు. సాధ్యమైనంత వరకు తనమనసును ముక్కలుచేయడానికే ప్రయత్నిస్తుంది! ఒకొక్కప్పుడు ఈ సానుభూతి వెగటుగామారి అభిమానం దెబ్బతింటుంది.సుజాతకు అలాగేవుంది. మాటిమాటికీ"అవిటిదిఅవిటిది"అనివచ్చినవాళ్ళముందల్లా తనసానుభూతిని ప్రకటించడంఆమెకుఅలవాటయిపోయింది. కాని, సుజాతకు భరింపరానిదిగా వుంది.

ఆ విషయాన్ని అతను గ్రహించాడు. హేమాదేవి మాటలధోరణికి సుజాతబాధపడుతుందని మాటమార్చేసాడు. "ఆఁ...అసలు విషయం చెప్పనేలేదు." అని తన ఉద్యోగ విషయంకదిపాడు.

"ఎందుకోయ్ అంతతొందర నీ ఉద్యోగం ఎక్కడికి పారిపోదులే. రేపేవచ్చి జాయినవ్వు అడ్వాన్సు ఏమన్నా కావాలంటే పట్టుకెళ్ళు."అన్నది హేమాదేవి.

"అసలు ఉద్యోగమేమిటి నాపనేమిటో తెలవిచ్చారు కాదు" అని నీళ్ళునమిలాడు.

"నీఉద్యోగం మా ఇంట్లోనే—"అని గలగల నవ్వేసింది హేమాదేవి.

ఆనవ్వు సుజాతకు కంపరం కలిగించింది! వాళ్ళ మాటలు విననట్లే వింటుంది.

"మీ ఇంట్లోనా!" కళ్ళుచికిలించి ఆశ్చర్యంగా అడిగాడు చంద్రమోహన్.

"ఎందుకింత ఆశ్చర్యపోతావు? మాయింట్లో ఉద్యోగం చేయవా?"

"అభ్యంతరమేం కాదు జీతం డబ్బులుకోసంపనిచేసేవాడికి ఏస్థలమైనా ఒక్కటే"

"నీవు ఉదయం రెండుగంటలు, సాయంత్రం రెండుగంటలు వచ్చి మాసుజాతకు కాలక్షేపంగా ఏదైనా చదివి వినిపిస్తుండాలి....అదే నీడ్యూటీ"

ఆ మాటలకు సుజాతతో పాటుచంద్రమోహన్ కూడ విస్తుపోయాడు. ఆమె ఆంతర్యమేమిటో వారెవరికీ బోధపడ లేదు. "ఏమ్మా సుజా ఇలా అయితే బావుంటుంది కదూ! ఒక్కదానివే బోర్ తో విసిగిపోకుండా చంద్రా మంచి కాల క్షేపంగా వుంటాడు కథలు, పుస్తకాలు చదివి వినిపిస్తుంటాడు, ఏమంటావు?"

"నాకు ఎవరితోడూ అక్కర్లేదు." కచ్చితంగా అన్నది సుజాత.

"మీకు అవసరం లేక పోయినా నాకు ఉద్యోగం కావాలి. ప్లీజ్ అంగీకరించండి. మీకు నేను ఏవిధంగానైనా ఆటంకం కలిగించను. నన్ను నమ్మండి ప్లీజ్—" అభ్యర్థనా పూర్వకంగా అతను ఆవిధంగా అంటూ వుంటే సుజాత కెందుకో తిరస్కరించబుద్ధి వేయలేదు. అవుననీ కాదని ఏమీ చెప్పక మౌనంగా వుండిపోయింది. "పిచ్చిపిల్ల అదిఅలాగే అంటుంది నికెందుకు నీవురోజూ వచ్చిపోతుండు చంద్రా. నాకు క్లబ్ కు టైమవుతుంది. మరివస్తాను. ఇంద రెండువందలు వుంచు" అని నోట్లు అందించి వెళ్ళిపోయింది హేమాదేవి.

ఇక అక్కడ వారిద్దరేమిగిలారు. ఇరువురూ మౌనంగా వుండిపోయారు.

ముందుగా చంద్రమోహన్ కల్పించుకుని ఇలా అన్నాడు... చూడండి! నిరుద్యోగమనేది మహాభయంకర మైనది. బి.ఏ. ప్యాసై రెండు ఏళ్ళవుతుంది.ఎన్నోచోట్లపిచ్చి కుక్కలా తిరిగాను. కానీ ప్రయోజనం లేకపోయింది. నాకు ఉద్యోగం చాలా అవసరం. అందుకే హేమాదేవిగారు ఉద్యోగం మిప్పిస్తానంటే ఆశతో వచ్చాను. అయినా నాకు రెండువందలుఇచ్చినంతమాత్రాన మీసిరులు తరిగిపోతాయా? నా జీతం మీ టాయిలెట్ సామాన్ల ఖర్చంతకూడా కాదు కనుక మీరేమీ అనుకోవద్దు. మరేదైనా ఉద్యోగం చూసు కునేంతవరకూ నేను మీ ఇంటికి వస్తూనే వుంటాను—"

'పాపం! ఇతన్ని ఉద్యోగం ఆశచూపి తన చుట్టూ తిప్పుకొంటుందన్న మాట. చూడబోతే మంచివాడిలానే వున్నాడు, కష్టాల్లో వున్నాడట అలాగే రమ్మంటే పోలా! తనకూ కొంచం తోడుగా, ఆసరాగా ఉంటాడు. అంతగా అతని ప్రవర్తన నచ్చకపోతే మానుకోమనేది-'అనిఆలోచించు కుని "మొదటి మిమ్మల్ని చూసి అపార్థం చేసుకున్నాను నిజంగా మీరు ఉద్యోగానికి వచ్చారండి. నమ్మలేకపోయాను. అందుకు కారణాలు చాలా ఉన్నాయనుకోండి. నాకేం అభ్యం తరం కాదు. మీరు రావచ్చు..."అని అన్నది.

"చాలా థ్యాంక్సండీ...మీదృష్టిలో ఇది చిన్న సహా యం గానే కనిపించవచ్చుగాని, నాకు మాత్రం జీవిత సమస్య మీరు ఓ. కే. అన్నారు చాలా సంతోషం మీ మనస్సు నొప్పించక ప్రవర్తించు కుంటానని మాట ఇస్తున్నాను" అన్నాడు కృతజ్ఞతగా.

అతని సహృదయానికి ఆమె ముగ్ధురాలైంది. ఆ తరు వాత ఏవో కబుర్లు మొదలెట్టి ఆమెను ఆకట్టుకున్నాడు. అతని కబుర్లు ఆమెకు ఆసక్తికరంగావున్నాయి. ఏవో విట్స్ చెప్పి, చారవగా నవ్వించాడు. మొత్తానికి ఆమెను ఆహ్లాద పరిచేం దుకు ప్రయత్నిస్తున్నాడు! చీకటి పడుచుండగా, మరలా రేపు ఉదయంకలుస్తానని...ఆమెవద్ద శెలవుతీసుకుని బయలు దేరాడు.

అతనిరిప్పుడు ఎంతో సంతోషంగా వుంది. ఏదో అంద లేనిది అందుకున్నంత సంబరంగావుంది. తను తొలిసారిగా

సంపాదించిన రెండువందలతో దుర్గాంబకు ఓ చీర, రామ చంద్రయ్యకు ఓ పంచె తీసుకున్నాడు. అలాగే వాహినికి ఓ మంచి పుస్తకం కొన్నాడు. ఆనందతరంగాలలో తేలిపోతూ ఇల్లు చేరుకున్నాడు.

“అమ్మా! నాకు ఉద్యోగం వచ్చింది. నీ ఆసీస్సులు ఫలించాయమ్మా. ఇదంతా నీ చేతి చలువే—” అని ఆమె పాదాలకు నమస్కరించాడు పొంగిపోతూ. అతని సంబరాన్ని చూసి దుర్గాంబ ఉక్కిరి బిక్కిరయింది.

“ఇదిగోనమ్మా! తొలి సంపాదనతో చిరుకానుక తెచ్చాను.” అని చీరె అందించాడు అతని ప్రేమకూ, ఆప్యాయతకు ఆమె కరిగిపోయింది.

“చాలు బాబూ! చీర తెచ్చావని కాదు మేమూ ఆ మాత్రం గుర్తున్నందుకు నేను గర్వపడతున్నాను...”

“ఎంతమాటమ్మా! కన్నవాళ్ళకు భారమయి అలమటించే నా చీకటి బ్రతుకున వెన్నెల కురిపించిన అమృత మూర్తులు మిమ్మల్ని ఎలా మరిచిపోతాను! నాకు మాత్రం ఇంకెవరున్నారు అన్నీ మీరే...” చంద్రమోహన్ మాటలకు ఆ ముసలి దంపతులు తృప్తిగా నిట్టూర్చారు. ఆరోజు వాళ్ళకు పండుగ మాదిరి గడిచిపోయింది ఆనందంగా ఎన్నో రోజులనుంచి తను చదవాలనుకుని ‘బుద్ధుని చరిత్ర’ తెచ్చినందుకు కృతజ్ఞతగా చూసింది వాహిని.

పైన చిందులేస్తుంది. నిజానికి ఆమె అలాఅహ్లాదంగా హృదయ పూర్వకంగా నవ్వి ఎన్నిరోజులైందో! ఇప్పుడు నవ్వగలుగుతుంది హాయిగా. చంద్రమోహన్‌కి కావాల్సింది అదే! తను దురదృష్టవంతురాల్ని అని ఆమె గుర్తుతెచ్చుకుని వ్యధ చెందకుండా ఆ బాధను మరుపింప జేయాలన్నదే అతని తపన.

"అన్నట్లు మరిచాను. హేమాదేవిగారు యేరీఎక్కడా కనిపించడంలేదే?"

"ఆమెగారుఇంకానిద్రలేవలేదు. ఒక్కోరోజులు పన్నెండు దాటి ప్రొద్దు వడినెత్తిమీదకివస్తేగానీఆమెకు తెల్లవారదు"

"సరే, మీరు టిఫిన్ వగైరాలు, పూర్తయ్యాయా?"

"దేనికి? కాకుంటే భాగం కలుద్దామనా ఈ ఆరాలు"

"అమ్మో ఫర్వాలేదే మీకూ మాటలొస్తాయ్! యేమోననుకున్నా నండోయ్. మీరు మహాధైర్యవంతులు" అని మెచ్చుకోలుగా హాస్యంగా అన్నాడు.

ఎందుకో అతనావిధంగా పొగుడుతుంటే ఆమెకు సిగ్గేసింది.

"చెప్పండి. మన ప్రోగ్రామేమిటీ?"

"మీరే చెప్పండి. ఏం చేయాలనుకున్నారో-"

"అదికూడా నేనే నిర్ణయించాలన్నమాట ఆల్ రైట్ మీకో మంచి కథ వినిపించాలని తెచ్చాను-"అంటూ అంత వరకు చంకలో మడిచి పెట్టిన వీక్లీ బయటకు తీసాడు.

"కథా? ఏమిటా కథ?" అని అడిగింది.

"మంచి హాస్యకథ వినిపించమంటారా?"

ఆమె పెదవి విరిచింది. "హాస్యకథ నేను వినలేను బాబు" అని నవ్వింది.

"మరి ఎలాంటి కథలంటే మీరు ఇష్టపడతారు?"

"విషాదం కావాలి నేను దాన్నే ప్రేమిస్తుంటాను-"

ఉలిక్కిపడ్డాడా మాటలకు "ఏమిటిలా మాట్లాడుతుంది? అందరూ సుఖాన్ని, ఆనందాన్ని ఆశిస్తారుగానీ, ఈమె విషాదాన్ని ప్రేమిస్తుందా ఎందుకని?"

"ఆశ్చర్యంగా వుండవచ్చు నా మాటలు. కానీ నా మనసు విషాధ కథలను కోరుకుంటుంది. అందులోనూ ఆనందమున్నది, సంతోష విషాధ రాగాలు ప్రక్క ప్రక్క నే నాణేనికి బొమ్మా-బొరుసు మాదిరి వుంటాయి" అని ఎవరో కవి అన్నాడు. మరోకవి-శోకాన మరుగున కూడా సుఖమునదిలే-అని అన్నాడు. అలాగే ఆ విషాధం లోని ఆనందాన్ని కోరుకుంటాను" ఆమె మాటల్లోని గూడార్థము అతని బోధ పడింది.

"పాపం! ఆమె ఆలోచనలు ఆ విధంగా తయారవడానికి కారణం ఆమె దుర్భరస్థితేనని బోధపడిందతనికి—"

"అన్నట్లు మీకో విషయం తెలుసా?" మాట మార్చేస్తూ అడిగాడు.

"ఏమిటన్నట్లు కళ్ళు కదిలించి ప్రశ్నించింది."

"రాత్రి సికింద్రాబాదులో ఓ వింత జరిగిందట..."

"చెప్పండి ఏమిటో! అయినా తెల్లారేపాటికల్లా ఆ వార్త నీ చెవికెలా ఎక్కిందానికి?"

"లోకం కదండీ —ఎవరో చెప్పుకోగా నా చెవిలోనూ దూరింది. అది మీ చెవిలో వేద్దామని తాపత్రయం..." అని నవ్వాడు.

"సరే, సంగతేమిటి చెప్పండి..."

"రాత్రి నిద్రలో ఓ మనిషి లేచి స్మశానంలోకి వెళ్ళాడట!"

"నిద్రలోనే?"

"అవును. అక్కడ ఓ సమాధి దగ్గర కూర్చుని ఏడుస్తున్నాడట...ఆ చుట్టుపక్కలవాళ్ళు గమనించి, వెళ్ళి అడిగారట? అర్థరాత్రి ఎందుకిక్కడ కూర్చుని ఏడుస్తున్నావని? —"

"ఏం చెప్పాడేమిటి?" ఆసక్తిగా అడిగింది సుజాత.

ఆమె ఆసక్తిని గమనించి మరింత ఉత్సాహంతో చెప్ప నారంభించాడు చంద్రమోహన్.

"అయోమయంగా అందర్నీ చూసి "మీరంతా ఎందుకు వచ్చారు? నా భార్యతో నేను మాట్లాడడం మీకు ఇష్టం లేదా? వెళ్ళిపోండి యిక్కడనుంచి. ఏకాంతంగా నా భార్యతో ఊసులాడుకోవాలి" అన్నాడట..."

"అంటే అతని భార్య మరణించిందా?" అడిగింది సుజాత.

"అవునట రెండేండ్లక్రిందట అకస్మాత్తుగా పోయిందట. అక్కడే సమాధి చేశారట. ఇప్పుడతను ఆ సమాధి దగ్గరే

కూర్చుని ఏడ్చింది వింటూంటే చిత్రంగా లేదూ? చనిపోయిన మనిషితో మాట్లాడమేమిటి? అతనికి మతి చలించిందన్నారు"

"అలా అని ఎందుకనుకోవాలి. ఒకవేళ నిజంగా అతను భార్యతో మాట్లాడి వుండవచ్చుగదా? ఆశలు తీరని మనిషి అకస్మాత్తుగా మరణిస్తే, అతని ఆత్మ ఆ పరిసరాల్లోనే తిరుగాడుతుందని ఎన్ని నిదర్శన పూర్వకమైన కథలు వినలేదూ-ఎన్ని వార్తలు చదవలేదూ?"

"అంటే మీకు దెయ్యాలున్నాయని నమ్మకముందా? ఆమె అభిప్రాయం తెలుసుకోవాలని ప్రశ్నించాడు చంద్రమోహన్.

"ఏమో కరెక్టుగా చెప్పలేనుగానీ, ఏదో అదృశ్యశక్తి వుంటుందని నమ్ముతాను."

"ఈ కలియుగంలో దెయ్యాలున్నాయి అంటే ఎవరూ నమ్మరు. కళ్ళతో చూస్తేగాని నిజమనుకోరు. ఎన్ని కథలు విన్నా, ఎన్నివార్తలు చదివినా గాలికి కొట్టేస్తారు. నా మట్టుకు నేను అలాంటి పిచ్చికథల్ని చస్తే నమ్మను. ఎక్కడున్నాయండీ దెయ్యాలు! మనిషి బలహీనతే అలా భ్రమింపజేస్తుంది."

"పోనీ, ఆ విషయం వదిలేయ్. ఇది ఇప్పట్లో తేలే సమస్యకాదు! మరేదన్నా చెప్పండి—" వీల్ ఛైర్‌లో వెనక్కి వాలి; అలసటగా తలను రెండు చేతులలో వత్తుకుంది—

"ఏమిటి తల నొప్పిగా వున్నదా?" ఆదుర్దాగా అడిగాడు చంద్రమోహన్.

"అబ్బే! ఏం లేదు. ఇందాక ఏదో కథ చెప్తూ వున్నారు?" అని గుర్తు చేసింది.

"అలాగే–" అంటూ ఏదో ఒక కథ చదివి వినిపించాడు. ఆ కథమీద కొంచంసేపు చర్చ సాగింది. తరువాత చాలాసేపు కబుర్లు చెప్పాడు. పన్నెండు అవుతుండగా వెళ్ళిపోయాడు మరలా సాయంత్రం వస్తానని. అతను ఉన్నంతసేపు కాలం అతివేగంగా, హాయిగా దొర్లిపోయింది.

ఎందుకో అతను వెళ్ళిపోతుంటే సుజాత మనసు బాధగా మూలిగింది.

అతని కబుర్లు వింటుంటే సుజాతకు ఎంతో ఉత్సాహంగానూ, కాలక్షేపంగానూ వుంది. "ఏమోననుకున్నాను ఫర్వాలేదు. చాలా తెలివైనవాడు. ఏదో ఒకటి చెప్పి కాలాన్ని ఇట్టే గడిపేశాడు. మరలా సాయంత్రం ఎప్పుడవుతుందో... అంతవరకూ, తను ఏకాకి మామూలు ఒంటరి జీవితం—" వేడి నిట్టూర్పు వెలువడింది సుజాతనుండి.

అతను వెళ్ళిన కొద్దిసేపటికి హేమాదేవి అప్పుడే నిద్రలేచి, బద్ధకంగా ఆవులిస్తూ బయటకు వచ్చింది. సుజాతను చూసి "సుజా! చంద్రా వచ్చాడా?" అని అడిగింది.

"వచ్చి వెళ్ళాడు..."

"మరి. నన్ను లేపలేదే?"

"అయినా, ఆబుద్ధావతారంఎక్కడదొరికాడ తయ్యా ఓ మాట లేదా మంచీ లేదు వచ్చినప్పటినుండి గోళ్ళు కొరుకుతూ వుండిపోయాడు. అతని పద్ధతినాకేం నచ్చలేదు. ఉలెనికి జీవిమివ్వడం దండుగ–"

"కొత్తగదా! రెండురోజులుపోనీ. అతనే దారికివస్తాడు" అని నవ్వుకుంటూ బాత్ రూము వేపు నడిచింది హేమాదేవి.

సుజాత అలా అబద్ధం చెప్పడానికి తగిన కారణం లేకపో లేదు.

అతని కబుర్లన్నా, కథలన్నా తను ఇష్టపడుతున్నానని తెలిస్తే ఆ కాస్త ఆనందాన్నికూడా తనకు దక్కనివ్వదు అసలు అతన్ని ఉద్యోగమని ఎరవేసి లాక్కొచ్చింది తనకు కాలక్షేపంగా ఉంటాడనికాదు...ఆమె స్వార్థం! అతని పరిస్థితిని ఆసరాగా తీసుకొని లొంగదీసుకోవాలన్న తలంపు...ఛీ ఏం మనిషో! కంటికి ఎదురుగా కనపడ్డ వాడినల్లా ఇంటికి తీసుకువస్తుంది ఏదో ఒక సాకుతో.

ఇతను అలాంటివాడు కాదనిపిస్తోంది. అయినా అత్తయ్య ఊరుకుంటుందా? అతని మెడలు వంచి తనవేపుకు తిప్పుకోదూ? అంతటి సమర్థురాలే— అని కసిగా తిట్టిపోసుకుంది మనసులోనే సుజాత.

సాయంత్రం నాలుగు గంటలకు వచ్చాడు చంద్రమోహన్.

అతన్ని చూస్తూనే సుజాత ముఖం వికసించింది. తనకు తెలీకుండానే అతనివేపు ఆకర్షితురాలవుతోంది—అతని సన్నిధిలో ఉన్నంతసేపూ మనసు హద్దులు దాటి పరవళ్ళు తొక్కుతుంది- ఏదో వింత అనుభూతి, హాయి గుండెల్ని ఊపేస్తున్నాయి- తనస్థితి తనకు తెలుస్తుందీ ఈ స్థితి చివరికెలాంటి పరిణామాలకు దారితీస్తుందోనన్న భయం కూడా లేకపో లేదు. కానీ, ఎంత నిగ్రహించుకుందామన్నా

మనసు తనమాట వినడంలేదు- రోజులు గడుస్తున్నాయి- చంద్రమోహన్ రోజూ వస్తూనే వున్నాడు.

# 7

రోజులు సరదాగానే దొర్లుతున్నాయి సుజాతకు—— చంద్రమొహన్ ఎంతో ఆత్మీయంగా, చనువుగా, ఆమె మంచిచెడ్డల్ని విచారిస్తున్నాడు. ఇన్నాళ్ళూ ఒంటరితనంతో విసిగిపోయిన సుజాత ఇప్పుడు అతనితో మాట్లాడం, గంటల తరబడి వాదించడం చాలా ఆనందంగా వున్నది.

హేమాదేవి ఊహించినది వేరు- జరుగుతున్నది వేరు- తన కోరిక తీర్చుకోవడానికి అతన్ని ఉద్యోగం సాకుతో ఆ ఇంట్లో తిరగాడేట్లు చేసింది కానీ, అతను అంతంత మాత్రానికే లొంగే ఘటంలా కనిపించలేదు. అయినా ఏమీ అనలేక అదునుకోసం వేచివున్నది.

ఆరోజు చంద్రమోహన్ వచ్చేసరికి సుజాత యింకా లేవలేదు. అలాగే ముసుగు కప్పుకుని పడుకున్నది-"ఇదేమిటి ఈ రోజు యింకా ముసుగు కప్పేసే వున్నారు?" అన్నాడు వస్తూనే నవ్వుతూ——

ఆమె నవ్వింది నీరసంగా "ఏంలేదు. ఒంట్లో బావుండ లేదు—"

"మరి చెప్పరేం? డాక్టర్‌ని పిలిపించమంటారా?" కంగారుపడిపోయాడు.

"మీరు కంగారు పడవలసినంత జబ్బేమీ లేదు. కాస్త వళ్ళు వెచ్చజేసింది అంతే" అని వారించింది. అయినా చంద్రమోహన్ వినలేదు. "భలేవారే! చిన్నదే గదాని నిర్లక్ష్యంచేస్తే పెద్దదై కూర్చుంటుంది ఉండండి ఇప్పుడే వస్తాను" అని వెళ్ళి డాక్టర్‌కి ఫోన్ చేసి వచ్చాడు. మరో పదినిమిషాలకు డాక్టర్ వచ్చి సుజాతను పరీక్ష చేసాడు. "మామూలు జ్వరమే రేపటికల్లా తగ్గిపోతుంది. ఈ టాబిలెట్స్ వాడండి" అని చెప్పి వెళ్ళాడు.

"హమ్మయ్య! మామూలు జ్వరమేలే తగ్గిపోతుంది-" అని తేలికగా ఊపిరి పీల్చుకున్నాడతను. "నేనో మాట అడుగుతాను నిజం చెబుతారా?" అతని ముఖాన్నే పరీక్షగా చూస్తూ అడిగింది సుజాత.

"ఏమిటి?"

"నాకు ఒంట్లో బావుండలేదంటే మీ రెందుకంత కంగారు పడిపోయారు?"

"బావుంది మీ అర్థంలేని ప్రశ్న! మీరు ఆరోగ్యంగా ఆనందంగా వుంటేనే నాకు తృప్తి..."

"మీకు జీతం రాదనా?"

"ఛ...మరీ, అంత ఇదిగా మాట్లాడకండి. నేనూ మనిషి నే!" కొంచం నొచ్చుకుంటూ అన్నాడు.

"క్షమించండి. మీ మనసు నొప్పించినట్లున్నాను. నేను బలహీనురాల్ని—— అందుకే దేన్నీ నమ్మలేకపో తున్నాను——"

"అంటే నేను కేవలం డబ్బుకోసమే యింతటి అభి మానాన్ని కురిపిస్తున్నానంటారా? మొదట్లో అలాగే అను కున్నాను. అది నా విధి అని. మిమ్మల్ని సంతోష పెట్టాలని అనుకునేవాడిని. కానీ, యిప్పుడలా అనుకోవడం లేదు..."

"మరేమనుకుంటున్నారు?"

"మీ రంటే నాకు చాలా గౌరవం!"

"అదేనా? ఇంకేమీ లేదా? తనపిచ్చి గాకపోతే యెలా వుంటుంది? తనలో ఏం ప్రత్యేకత వుందని తనను అభిమానించి ప్రేమించగలడు? అందని పండుకు అర్రులు చాచడం తన అవివేకం! అసలు తన ఊహాలే గొంతెమ్మ కోరికల్లా వున్నాయి. అతను తన్ను అభిమానించాలనుకోవడం కూడా అత్యాశే! ఏదో ఆ మాత్రం గౌరవంతో నన్నా చూస్తున్నాడు. ఈ జన్మ కది చాలు. ఇంకేమీ ఆశించడం తగనిపని." అని తనకు తాను చెప్పుకుంది.

సుజాత కోలుకునేంతవరకూ దగ్గరుండి పపర్యాలు చేసాడు చంద్రమోహన్.

అతని సేవల్లో ఆమె సంపూర్ణ ఆరోగ్యవంతురాలు అయింది

"దీన్ని యేమంటారు!"

"దేనిని?" అయోమయంగా చూశాడు ఆమె వైపు చంద్రమోహన్.

"అదే! నాకు సపర్యలుచేస్తూ కంటికి రెప్పలా చూసుకోవడాన్ని..."

"మీరు ఏమనుకున్నా ఫర్వాలేదు. మీరు కోలుకున్నారు అంతేచాలు" తృప్తిగా నిట్టూర్చాడు చంద్రమోహన్. అతని ఆంతర్యమేమిటో ఆమెకు అంతు చిక్కడం లేదు. తను ఆనందంగా వుండాలని, ఆరోగ్యంగా వుండాలని కోరుకుంటున్నాడు దేనికి? జీతమిస్తున్న కృతజ్ఞతతోనా? లేక మరొక భావమున్నదా అతని మనసులో? ఏమో ఎలా తెలుస్తుంది?

కాలమే చెప్పాలి! అంతవరకు తను ఆశతో ఎదురుచూడాలి.

ఎంత కాదనుకున్నా ఆమె మనసు అతని సమక్షంలో వశం తప్పుతుంది.

అతన్ని మనసారా ప్రేమిస్తుంది. గుండెల్లో అతని మూర్తిని భద్రపరచి ఆరాదిస్తుంది మూగగా. అతను కావాలని కోరుకుంటుంది. అంతలోనే తనరూపమూ, స్థితిగుర్తుకు వచ్చి విలవిల్లాడిపోతుంది.

ఎన్ని విధాల ప్రయత్నించినా అతనిమనసును తెలుసుకోలేకపోయింది.

నవ్వుతూ నవ్విస్తాడు. అంతా బాగా నేవుంది అదంతా కేవలం తనడ్యూటీఅని చేస్తున్నాడా, లేక మరో ఉద్దేశ్యం

వున్న దేమోనని ఆలోచించింది కానీ ప్రయోజనం లేక పోయింది.

# 8

హేమాదేవి ఎన్నో విధాల ఉచ్చులు పన్నింది చంద్రమోహన్‌ని లోబరచుకోవాలని. ఆమె ఆంతర్యం గ్రహించిన అతను ఎప్పటికప్పుడు తెలివిగా తప్పుకొంటున్నాడు. అతనా విధంగా అంటీ ముట్టనట్లు తననుంచి దూరంగా పారిపోవడం సహించలేకపోయింది. ఓ రోజు అతన్ని పిలిపించి "ఇదిగో నీకు రావలసిన డబ్బు రేపటినుంచి రావాల్సినపని లేదు."

"కారణం తెలుసుకోవచ్చా" ఉండబట్టలేక అడిగాడు.

"కారణాలు చెప్పవలసిన అవసరం నాకు లేదు, నీ పని నాకు నచ్చడంలేదు అందుకే మానుకోమంటున్నాను, వెళ్ళు? యింకెప్పుడూ ఈ వేపుకు రాకు" కటినంగా అన్నది.

"థ్యాంక్స్! ఇంతకాలం మీ మీద మిగిలిన గౌరవం ఈ క్షణంతో తుడిచిపెట్టుకొనిపోయింది.. మీ రెందుకిలా చేస్తున్నారో నాకు బాగా తెలుసు. మీరు చెప్పినట్లల్లా ఆడడానికి నేనేం ప్రాణంలేని బొమ్మను కాను? మీ సంగతి నాకేనాడో

తెలుసు-అయినా సుజాతముఖంచూసి, ఆమె ప్రాణానికి ఆమెను వదలలేక వస్తున్నాను."

"అధిక ప్రసంగంమాని దయచేయి"

అంతవరకూ వాళ్ళమాటల్ని ఆలకిస్తున్న సుజాతతల్లి జిల్లిపోతూ బంతిని చరచరా త్రిప్పుకొంటూ అక్కడకి వచ్చింది.

"అత్తయ్యా! ఏమిటి నీ వంటున్నది? అతన్ని రావద్దని చెబుతున్నావా? దేనికి."

"సుజా! అనవసరం నీవీవిషయంలో తలదూర్చకు!" ఇతనిసంగతి నీకు తెలీదు."

"తెలుసు నాకు బాగా తెలుసు. అతను ఎక్కడికీ వెళ్ళడు. ఎప్పటిలా నేవస్తూవుంటాడు" దృఢనిశ్చయంతో తొణక్కుండా అన్నది సుజాత.

ఆమెకోపం తారాస్థాయికి చేరుకొంది.

"మధ్యలో నీదేమిటిబోడిపెత్తనం! ఈ ఇంట్లో నాకు వ్యతిరేకంగా ఏదిజరిగినా సహించలేను. యింకాచూస్తూ నిలబడ్డావేం కదులు" గర్జించింది.

చంద్రమోహన్‌కి కోపం బుస్సున పొంగింది-అయినా తమాయించుకొన్నాడు.

"నీ వంటి మూర్ఖురాలినికి ఏం చెప్పినా అర్థంకాదు. అభం శుభం ఎరుగని సుజాత నిస్సహాయస్థితిని ఆసరాగా తీసుకుని నీ యిష్టంవచ్చినట్లు మాట్లాడుతున్నావ్, భగవంతుడనే వాడు ఒకడున్నాడు? వాడి పంచాయితీలోనే నీ నేరాలకు తప్పులకు తగినశిక్ష అనుభవించకపోవు"

"పిల్లి శాపాలకు ఉట్లు తెగవు- గెటవుట్" హుంకరించింది హేమాదేవి

ఇక ఆమెతో మాట్లాడటం అవివేకంఅని తెలుసుకొని చరచరా మెట్లుదిగి క్రిందికి వచ్చాడు.

"ఏమండీ...మీరు వెళ్ళిపోవద్దు దయచేసి నామాట వినండి ప్లీజ్" పైనుండి దీనంగా అరుస్తోంది సుజాత.

"ఏమిటే నీ ఆగడం. కట్టుకున్నవాడు వెళ్ళిపోతున్నట్టు ఎందుకా వెధవేషం" పద లోపలికి" గయ్‌మంది.

రోడ్ మీద నిలబడి చివరిసారిగా ఆ భవనాన్ని సుజాతను చూసాడు. దీనంగావున్న ఆమె ముఖాన్ని చూసి అతని మనస్సు చలించింది. తమాయించుకుని చకచకా అడుగులు వేస్తూ జనంలోకి కలిసిపోయాడు.

సుజాత తనగదిలో మంచంమీదపడి విలపించింది. ఉన్న ఒక్క ఆత్మీయుడు దూరమైనందుకు గుండెలుపగిలేలా ఏడ్చింది.

"వెధవకు ఏమీ లేకపోయినా పొగరుకేమీ తక్కువ లేదు" అని మెటికలు విరిచి తిట్టిపోసింది హేమాదేవి.

ఆ రాత్రి సుజాతకు అన్నం సహించలేదు, అలాగే మంచంమీదపడి వుంది. ఎలావున్నావని పలకరించే దిక్కు లేదు. సీతమ్మకు వంట్లో సుస్తీగావున్నదని రెండురోజులనుంచి పనిలోకి రావడంలేదు. హోటల్ కారియర్ తెప్పిస్తుంది హేమాదేవి.

ఆ రోజు ఆ గొడవ జరిగాక కారులో ఎక్కడికో వెళ్ళి పోయింది ఆమె.

అంత పెద్ద భవనంలో ఒంటరిగా, గుండెల్ని పిండే వ్యథతో వున్నది సుజాత.

చంద్రమోహాన్ మనసంతా చేదుతిన్నట్టు అయి పోయింది. అన్నం సహించలేదు. పెరుగుకలుపుకుని రెండు ముద్దలుతిని లేచిపోయాడు. "బిడ్డడు దిష్టితిన్నాడు" అనిమగ్గా బాయి దిష్టితీసేసింది.

ఎంతకూ నిద్రరావడంలేదు చంద్రమోహాన్‌కి.వాహిని ఏదో పాఠంచెప్పమని వస్తే "మనస్సేంబాగోలేదు రేపుచెబు తా"నని పంపేసాడు. ఉన్న ఉద్యోగం ఊడిపోయింది మరలా జీవితం ప్రశ్నార్థకంగానే నిలిచింది. ఏం చేయాలో, మళ్ళీ ఏలా ఉద్యోగం సంపాదించుకోవాలోనన్న బెంగతో నిద్ర కరువైందతనికి.

ఆలోచనా తరంగాలలో కొట్టుకుపోతున్నాడు.

అయిపోయింది తన ఉద్యోగంమూనాళ్ళముచ్చటయి పోయింది. రేపటినుంచి మళ్ళీ అన్వేషణ ప్రారంభించాలి. హేమాదేవికి ఎంత అహం? ఛీ! నీతీజాతీలేనిమనిషి. పైకి పెద్దమనిషిలా చెలామణిఅవుతూ చేసేవన్నీ నీచపుపనులు. పాపం! సుజాత ఆ అభాగ్యురాలు తనువస్తుంటేచివరిసారిగా చూసినచూపు ఇప్పటికి వెంటాడుతోంది. ఏ ప్రేమకూ నోచు కోని జీవితం ఆమెది. భయంకర నరకాన్ని అనుభవిస్తుంది. అన్నీ వుండికూడా లేనిదయింది! తను మాత్రం ఏం చేయ

గలదు. భగవంతుడు విధించిన శిక్షను తను మాత్రం తప్పించ గలదా? తను ఇక రాడని తెలిసి ఎంతగా కుమిలిపోతుందో?

అయినా ఆ హేమాదేవి కెందుకంత హాగరు? వయసు ఉడికిపోతున్నా కన్నెపిల్లలా అలంకరించుకుని బరి తెగించి తిరుగుతోంది. సుజాత ఆ స్త్రీనంతా హారతి కర్పూరంలా చేస్తుంది. నోరున్నా సుజాత మాటను గెలవని స్త్రీగా ? రాక్షస జాతి స్త్రీలు ఇలాగే వుంటారేమో!

తన భవిష్యత్తు మాటేమిటి? రేపటి నుంచి ఏం చేయాలి మళ్ళీ ఉద్యోగం కోరుకుతుందా? ఎన్నాళ్ళు తిర గాలో! ఛీ? ఏం జీవితమో, మనిషిని స్థిరంగా నిలువనీయదు. ఎన్నో మలుపులు తిప్పుతూ అగచాట్లకు గురిచేస్తుంది-" అర్థ రాత్రి వరకూ ఇలాంటి ఆలోచనలలో నిద్రాదేవికి దూర మయ్యాడు చంద్రమోహన్.

మరుదినం అతను యింట్లోనే వుండటం చూసి "యేం బాబూ! పనిలోకి వెళ్ళలేదే" అని ప్రశ్నించింది దుర్గాబాయి

"లేదమ్మా ఈ రోజు వెళ్ళదలుచుకోలేదు—"

'దేనికి'

"ఊరికే-" ముక్తసరిగా చెప్పాడు. ఆమె మరేమీ అడగలేదు. రామచంద్రయ్య భోజనం చేసి ఆఫీసుకు వెళ్ళి పోయాడు. వాహినికాలేజీకి వెళ్ళిపోయింది. చంద్రమోహన్ తన గదిలోనే వుండిపోయాడు. వ్యర్థమైన ఆలోచనలు పసి ప్రాణాన్ని కొరుక్కు తింటున్నాయి ప్రియమైన వస్తువేదో చేజారిపోయినట్లు బాధపడిపోతున్నాడు.

అక్కడ సుజాత స్థితి కూడా ఆవిధంగానే వుంది.

ప్రతిరోజూ వస్తూవుతూ ఆ టయానికి వచ్చే చంద్రమోహన్ రాకపోయేసరికి మనసంతా దిగులుగా అయిపోయింది సుజాతకు. చాలాసేపు ఒంటరిగా ఏవో పిచ్చి ఆలోచనలతో ఆలోచనలతో గడిపేసింది. మధ్యాహ్నం సీతమ్మ వస్తూనే ఓ చీటి వ్రాసి ఇచ్చింది. "ఇదితీసుకెళ్ళి చంద్రబాబుకి ఇచ్చిరా. జాగ్రత్తలు చెప్పి పంపింది.

# 9

"హల్లో వాహినీ!" ఆ పిలుపువిని ఆగి వెనక్కి తిరిగి చూసింది వాహిని.

కృష్ణ పరుగులాంటి నడకతో వగరుస్తూ వచ్చాడు.

ఏమిటి అన్నట్లు నొసలు చిట్లించింది.

నీతో ఓ విషయం చెప్పాలి. అలా వెళ్దామా?"

"ఎక్కడికి? అసలు సంగతేంటి?"

"పద, తాగా, పద-" అంటూ ముందుకు దారితీసాడు కృష్ణ అతన్ని అనుసరించింది వాహిని. సవేరా హోటల్‌కి వెళ్ళారు. స్వీట్-హాట్ ఆర్డరిచ్చాడు.

"ని చర్యగా కొత్తగా వుంది. ఎందుకిలా హటాత్తుగా వచ్చి హోటల్‌కు లాక్కువచ్చావు?" చిన్నగా నవ్వుతూ అడిగింది.

"ఈ రోజు నా బర్త్ డే. అందుకే ఈ చిన్న పార్టీ-" తానూ నవ్వేడు కృష్ణ.

"ఓహో! చెప్పవేం మరి. అందుకో నా అభినందనలు."

"ఉట్టి అభినందనలు ఏం చేసుకోను?"

"మరేం కావాలి?"

"అడగనా?" కొంటెగా నవ్వాడు.

"వద్దులే బాబూ! నీవసలే మొండివాడివి తీరా కోరనిది కోరాక నేను ఇబ్బందుల్లో పడాల్సివస్తుంది."

"అయితే నాకు కానుకలూ, గ్రీటింగులూ లేనన్నమాట-" బుంగమూతి పెట్టాడు

ఆమె నవ్వుకుంది హాయిగా. స్వీటు వచ్చింది.

"కాసింత్. తర్వాత మరో ప్రోగ్రామ్ వుంది." తొందరించాడు కృష్ణ.

"ఏమిటో అది?"

"సాయంత్రం మా యింట్లో పార్టీ వుంది. చాలా గ్రాండ్‌గా జరుగుతోంది. నీవు తప్పక రావాలి సుమా!"

"రాకుంటే ఏం చేస్తావు?" చిలిపిగా కవ్వించింది.

"పోనీ వస్తే ఏమిస్తావు?"

"నీలా మాట తప్పను. ఏం కావాలన్నా ఇస్తాను."

"ఊహు..." నవ్వింది మృదుమధురంగా.

"వస్తావు గదూ?"

"దేవి గారి ఆజ్ఞను శిరసావహిస్తున్నను. కానివ్వండి మీ షరతు లేమిటో-"

ఆమె నవ్వింది వెన్నెల విరిసినట్లుగా. అతను మైమరచి పోయాడు ఆ నవ్వును చూసి.

"వాహినీ, నీనువ్వు ఎంత అందంగా వుంటావో తెలుసా? తన్మయత్వంగా చూసాడు.

"ఊహుం...అంత బావుంటుందా?"

"అవును సిగ్గుతో ముడుచుకుపోయింది. కాఫీలుకూడా పూర్తి చేసారు.

"చెప్పు వాహినీ! పార్టీకి వస్తావు గదూ?"

"నీ పాట వినిపిస్తానంటే తప్పకుండా వస్తాను. మృదు మధురమైన నీ పాట విని ఎన్నాళ్ళయిందో?"

"నీవు కోరాలేగానీ ఒక పాట ఏం ఖర్మ. ఇలా నీకళ్ళ లోకి చూస్తూ ఎన్ని యుగళ గీతాల్ని ఆలపించగలను." వాం ఛల్యంతో అతని గొంతు తీయగా పలికింది.

"చాలు కృష్ణా. నీ అభిమానానికి ధన్యురాల్ని. నీ ప్రేమను పొందడం నా పూర్వజన్మ పుణ్యం"

మృదువుగా అతని చేయినొక్కి వదిలేసింది. మరోసారి అయితే ఆమెనలాగే సందిట బంధించి ముద్దుల వర్షం కురిపించే వాడు. అది అనువైన స్థలం కాదుగాబట్టి సంబాళించు కున్నాడు.

"నీ కోసం వళ్ళంతా కళ్ళు చేసుకుని ఎదురు చూస్తుని టాను." అని నవ్వేసి వెళ్ళిపోయాడు కృష్ణ.

వాహిని నవ్వుకుంటూ యింటి దారి పట్టింది.

"కృష్ణ చాలా మంచివాడు. గొప్పవాళ్ళ అబ్బాయి అయినా ఏమాత్రం అహంగానీ, గర్వంగానీ లేదు. ఎప్పుడూ స్వేచ్ఛంగా నవ్వుతూ అందరితోనూ కలివిడిగా తిరుగుతాడు. తనంటే ఎంత ఆపేక్ష! అతని ప్రేమను పొందగలదా? ఇరు వురి మధ్య వెయ్యో యోజనాల దూరం. నక్కకు నాగ లోకానికి వున్న తారతమ్యం అంతస్తుల వ్యత్యాసం. అతన్ని భర్తగా పొందడం ఎంతటి అదృష్టం

ఇలాంటి ఆలోచనలతో ఇల్లు చేరుకుంది వాహిని.

రామనాథంగారిల్లు కళకళ లాడుతోంది. విద్యుద్దీపా లంకరణతో ఇంద్రభవనంలా వెలిగిపోతుంది అక్కడకువచ్చిన వాళ్ళంతా గొప్పవాళ్ళు. ఆ పట్టణంలో పేరు ప్రఖ్యాతులు వహించినవాళ్ళు. ధనవంతులు ఒక్కొక్క కారు వచ్చి ఆగు తోంది. వచ్చినవాళ్ళను స్వయంగా చిరునవ్వులతో లోనికి ఆహ్వానిస్తున్నారు రామనాధంగారు. ఎక్కడచూసినా ఖరీదైన

కార్లు. సూట్ లు బూట్లు. సెంటు పరిమళాలు పట్టుచీరెల రెప రెపలు. అంతా ఖరీదైన వ్యక్తులే.

రామనాథంగారు ఆపట్టణ ధనవంతులతో ఒకరు. ఆయనకు చాలా ఆస్తివుంది. ఒక్కడే వారసుడు కృష్ణ. ఒక్కగానొక్క కొడుకు పుట్టినరోజు వేడుకను తమ అంతస్థుకు తగ్గట్లుగా ఏర్పాటుచేశాడు. కృష్ణఫుల్ సూట్ లో రాజకుమారుడిలా వెలిగిపోతూ, వచ్చినవాళ్ళను చిరునవ్వుతో పలకరిస్తూ వారికి ఉచితరీతిన ఆసీనులను చేస్తున్నాడు. పనివాళ్ళు చాలా హడావిడిగా తిరుగుతున్నారు.

కృష్ణ అంతమంది మధ్యవున్నా అతని దృష్టి గుమ్మం మీదే వున్నది, వాహిని రాకకై ఎదురుచూస్తున్నాడు. ఆమె వస్తుందో రాదోనన్న అనుమానం పట్టిపీడిస్తుంది అతిథులంతా వచ్చేశారు రామనాథంగారు తొందర పెడుతున్నారు, కేక్ కట్ చేయించాలనీ. ఆ తరువాత పార్టీకి అన్ని ఎరేంజ్ మెంట్సు చేసివుంచారు. కృష్ణకు వుత్సాహం లేదు. "వాహిని వస్తానని ఎందుకు రాలేదు—తన పుట్టినరోజని మరీమరీ చెప్పాడే-"

వాహిని ఆ ఇంటినిచూసి హడలిపోయింది. కృష్ణ కలవారి అబ్బాయిఅనిమాత్రమే తెలుసుకానీమరీఇంతటి శ్రీమంతులు అని తెలీదు—ఆ ఇంటిని ఆ హోదాను చూస్తునే జంకులాటింది పట్టుకుని అడుగుముందుకు పడలేదు—గుమ్మందగ్గరే ఆగిపోయింది ఆమె చేతిలో దేవులపల్లికృష్ణశాస్త్రిగారి "మేఘమాల" పుస్తకమున్నది. కృష్ణకు ఆయనపాటలంటే ఎంతో మక్కువ. అందుకే ప్రత్యేకంగా ఆతడికి కానుకగా యివ్వాలని కొని తెచ్చింది.

ఆతడు కనుపిస్తాడేమోనని రెండు నిముషాలు అక్కడే నిలుచుండి పోయింది.

ఎవరో కొత్తవాళ్ళు హడావిడిగా తిరుగుతున్నారు. వాళ్ళు ధరించిన చీరెలు. నగలు చూస్తుంటే వాహినికి కళ్ళు తిరుగుతున్నాయి. ఇంతలో ఓ నౌకరు ఆమెను గమనించిదగ్గరకు వచ్చాడు-"ఎవరమ్మా నీవు? ఎందుకు ఇక్కడ నిలుచున్నావ్?" ఇక్కడకు వచ్చేవాళ్ళంతా ఖరీదైన మనుష్యులే నీలాంటి సామాన్యవ్యక్తికి ప్రవేశంలేనట్లుంది వాడివైఖరి.

"కృష్ణబాబును కొంచెం పిలుస్తావా?" బెరుకుగా నే అడిగింది.

"వారిప్పుడు కనుపించరు. అవతల పెద్దవాళ్ళతో మాట్లాడుతున్నారు"

"నీకోసం ఎవరో వచ్చారని చెప్పు-ఒక్కనిముషం మాట్లాడేసి వెళతాను" బతిమాలుతున్నట్లు అడిగింది.

"చెబుతుంటే నీక్కాదూ-మళ్ళీరాపో ఇప్పుడు వీలుపడదు-" గసురుకున్నట్లు అన్నాడువాడు ఆమెముఖం చిన్నబోయింది. నౌకరు అరుపులకు రంగనాథంగారు అటుగా వచ్చాడు-

"ఏమిట్రాఆగొడవ?" అని ఆమెనుచూసి ఏంకావాలి?

"నా పేరు వాహిని. కృష్ణబాబుక్లాస్ మేట్ ని" అనిచెప్పుకుంది బిడియంగా?

"అయితే ఇప్పుడేమిటి?" విసుగ్గాచూశాడు రంగనాథంగారు.

"వారితో ఒక్కమాట..."

"ఇప్పుడు వీలులేదు" ఆమెమాట పూర్తికాకుండానే అనేసి వెళ్ళిపోయారు.

వాహిని కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి, అవమానంతో మనసు ఉడికిపోతుంది "ఛీ ఇంకా ఇక్కడ ఉండటం బుద్ధితక్కువ" అని అనుకొని 'ఇదిగో ఇది కృష్ణబాబుగారికి అందజేయి" అని తను తెచ్చిన ప్యాకెట్ నౌకరికిచ్చి అక్కడినుండి కదలిపోయింది వాహిని.

కిృష్ణబాబుగారు కావాలట, కృష్ణబాబు - గొప్ప వాళ్ళతో మాట్లాడాలన్నా 'వారిప్రక్కన కూర్చోవాలన్నా అర్హతా, అదృష్టం వుండవద్దు. ఇదేమిటో బహుమతి కాబోలు ముష్టి పుస్తకం దేనికి? వాయ్యిమంట చేయడానికూడా పనికి రాదు" అని విసురుగా పుస్తకాన్ని గోడవతలకు విసిరేశాడు నౌకరు వాహిని అత్యంతప్రేమతో తెచ్చిన కానుక మూళీలో పడిపోయి దీనంగా చూస్తోంది ఆ సిరిగల ఇంటిని.

# 10

సుజాత వ్రాసిన లెటర్ని మరోసారి చదువుకున్నాడు చంద్రమోహన్.

"శ్రీ యుత చంద్రమొహన్ గారికి నమస్సులతో—

మీతో ఓ ముఖ్యవిషయం మాట్లాడాలి, తప్పక నా మీద దయవుంచి ఒక్కసారి వచ్చిపోండి. నిన్న జరిగినసంఘటనకు నేను సిగ్గుపడుతున్నాను. ఉదయంనుంచి నంటరితనంతో విసుగెత్తి పోయాను- మీరు రారని తెలిసీ ఎదురుచూస్తూ వుండిపోయాను. ఈ దీనురాలి ప్రార్థనను ఆలకించి ఒక్కసారి వచ్చిపోండి. తప్పకుండా వస్తారని ఆశతో ఎదురుచూస్తూ వుంటాను.

సెలవు

సుజాత—

కొంతసేపు ఆలోచించి, చివరకు వెళ్ళడానికే నిశ్చయించుకున్నాడు. ఆమెమీదగల జాలీ, సానుభూతే అతన్ని

మరలా ఆ ఇంటిమెట్లు ఎక్కేలా చేసింది. చంద్రమోహన్‌ని చూస్తూనే సుజాతకళ్ళలో కోటిదీపాలు వెలిగాయి. "రండి-రండి" అంటూ ఆత్మీయనురాగాలు ఉట్టిపడేకంఠంతో ఆహ్వానించింది నమస్కారం చేస్తూ ఆమెకు ఎదురుగా వున్న కుర్చీలాక్కొని కూర్చున్నాడు అతడు.

"నా మాట మన్నించి వచ్చినందుకు కృతజ్ఞురాల్ని-"

"చెప్పండి. ఏమిటో మాట్లాడాలన్నారు" మామూలుగా అడిగాడు.

"నిన్న మా అత్తయ్యప్రవర్తనకు మీరుచాలా నొచ్చుకొని వుంటారు-"

"అలాఅని ఎందుకనుకుంటున్నారు?"

"అభిమానవంతులు-ఆమెకు నిలువెల్లా అహమే. తన మాటలకు ఎదుటివాళ్ళు బాధపడతారనిఅర్థంచేసుకోలేదు."

"ఇప్పుడా విషయం దేనికి గతం గతః" నవ్వలేక నవ్వాడు.

"ఏం చేయదలుచుకున్నారు?"

"ఇంకా నిర్ణయించుకోలేదు. ఏదైనా చేయాలిగా—తప్పదు-"

"మీరు నాకో చిన్నసాయం చేసిపెట్టాలి-"

"మీకు నేనేం చేయగలను? అయినా చెప్పండి నా శక్తిమేరకు చేస్తాను-"

"మీ మీద నా కా విశ్వాసముంది" అని ఆగి ఊపిరి పీల్చుకుంది సుజాత

అతను మౌనంగా కూర్చున్నాడు ఆమె ఏం చెబుతుందోనని...

"నేను ఓ కాలనీ కట్టించాలని అనుకుంటున్నాను— అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ మీరు చేసిపెట్టాలి."

"అంటే నా కర్థంకాలేదు వివరంగా చెప్పండి—"

"వికలాంగులకోసం ఊరిచివర మా తోటలో కొన్ని బిల్డింగులు కట్టించాలని నిర్ణయించుకున్నాను. దాదాపు పలభై ఎకరాల తోట వుంది. అందులో ఏవో పిచ్చి మొక్కలు, చెత్తా చెదారం పేరుకుపోయింది. దానిని శుభ్రం చేయించి ఓ మంచిపనికి వినియోగించాలి. శాపగ్రస్తులైన వికలాంగులకు వసతి, వైద్యసౌకర్యమూ కల్పించాలి ఇంతటి ఆస్థి ఉండీ నేను ఏంచేసుకోను? మనిషికి సుఖశాంతులు ఇవ్వలేని ఈ సిరిసంపదలు దేనికి? కనీసం నాలాంటి వాళ్ళకైనా ఉపకరిస్తే అంతేచాలు" ఆమె ఆగింది- అతడు ఆశ్చర్యంగా వింటున్నాడు.

"నా ఆస్తిపాస్తులన్నీ వాటికే వినియోగించాలి! ఈ ఇల్లు, కారులూ అన్నీ అమ్మేసి నేను వారిమధ్యకే తరలి వెళ్ళిపోతాను. ఇది నేను తీసుకున్న నిర్ణయం. ఇందులో మీ సహకారం ఎంతేనా అవసరం—"

"నాకంతా అయోమయంగా వుంది ఇంతటి ఆస్తిపాస్తుల్ని వదలేసి ఊరిబయట వుంటారా? మీరెందుకీ నిర్ణయానికి వచ్చారు?" విస్తుపోతున్నాడు చంద్రమోహన్.

ఆమె నవ్వింది విరక్తిగా—

"ఇది ఈనాడు ఒక్క రోజులో తీసుకున్న నిర్ణయం కాదండి- చాలా రోజులనుండి నా మనసులోనే మిగిలి పోయింది. మిమ్మల్ని చూశాక నా ఆశయాన్ని సఫలీకృతం చేయగలరన్న నమ్మకం, విశ్వాసం కల్గింది. ప్లీజ్ నా మాట కాదనకండి. మీరెటూ ఉద్యోగంకోసం వెదుకుతున్నారు. మీరేమీ అనుకోకపోతే ఈ కార్యభారాన్ని మీరే వ్యవ హారించండి. మీరు కావాల్సినంత జీతం తీసుకోండి."

"తొందరపడుతున్నారేమో! మరోసారి ఆలోచించు కోండి..."

"ఇప్పటికే జాప్యం జరిగిపోయింది. మా అత్తయ్య డబ్బును మంచినీళ్ళప్రాయంగా తన విలాస జీవితానికి వాడే స్తుంది. ఇది యిలాగే కొనసాగితే యింతటి సిరిసంపదలు యెందుకూ కొరగాకుండా పోతాయి. అందుకే ఈ నిర్ణయా నికి వచ్చాను-"

"మీ అత్తయ్యకు తెలిస్తే ఊరుకుంటుందా?"

"ఇందులో ఆమె ప్రసక్తి లేదు యిది నా ఆస్తి. నా యిష్టం ఆమె నాకు గార్డియన్‌గా వుంది. నాకు మైనారిటీ తీరిపోయి చాలా రోజులయింది. ఆమె అభ్యంతరం చెప్పినా చెల్లను. ఆమె అంగీకారాలతో నాకు పనిలేదు. నేను చేస్తున్న పని నాకు తృప్తి నివ్వగలదు అనిపిస్తుంది. మరేమీ ఆలోచించకుండా ఏర్పాట్లు చూడండి- కేవలం ఉద్యోగస్తు నిగా కాక, ఓ ఆత్మీయునిగా, మంచి స్నేహితునిగా నా మనసును అర్థం చేసుకోమని ప్రార్థిస్తున్నాను."

"మనిషిగా మీరు తీసుకున్న నిర్ణయాల్ని అభినం ధిస్తున్నాను-మిత్రునిగా, మీ మేలు కోరేవానిగా మరోసారి ఆలోచించమంటున్నాను- ఉన్న ఆ స్త్రీనంతా ఆ విధంగా విని యోగి స్తే మీరేవిధంగా జీవించగలరు?"

"మనిషి బ్రతకడానికి పిడికెడు మెతుకులు చాలు. ఈ పెద్ద పెద్ద మిద్దెలు, కార్లు హంగులు పని లేదు. నేనూ వారి తోనే అక్కడే నా మిగిలిన జీవితాన్ని గడిపేస్తాను. ఈ జీవి తానికి అంతకుమించిన కోరికలు లేవు. కోరికలున్నా అవి అత్యాశలే అవుతాయి." అలా అంటున్నప్పుడు ఆమె కంఠం వణికింది. అతను గమనించకపోలేదు- కొన్ని క్షణాలు వారి మధ్య మౌనం చిందు లేసింది.

"మీరేమీ అనుకోకపోతే నా దొక్కమాట..." జంకుగానే అడిగాడు.

"అడగండి మీ దగ్గర దాచుకునేవి ఏవీ లేవు-"

"మీరు పెళ్ళి చేసుకోరా?"

ఆమె నవ్వింది అదోలా. ఆ నవ్వులో విషాదమే ఎక్కువగా వున్నది.

"పెళ్ళా!? నాకూ చేసుకోవాలనేవుంది. కానీ... చూస్తూ చూస్తూ ఈ కురూపిని ఎవరు చేసుకుంటారు? ఒక వేళ ఎవరన్నా ఆదర్శపురుషుడు ముందుకు వచ్చినా, నా మీద సానుభూతితోనో, లేక జాలితోనో తప్ప- నన్ను నన్నుగా ప్రేమించేవాళ్ళు వుండరు."

"లోకంలో మంచితనం యింకా చావలేదు. మీకేం తక్కువ? ఎవరైనా లక్షణంగా చేసుకోవచ్చును."

"అవును నాకేం తక్కువ? పెద్ద యిల్లూ, కారు, కంపెనీలో వాటాలూ బ్యాంకులో నగలు, క్యాష్, తోటలు, దొడ్లూ ఓహ్! నాకేం తక్కువ-అన్నీ వున్నాయ్!"

"ప్లీజ్! మీరు ఆవేశపడకండి-"

"మరేమిటి ఏ పిచ్చి ప్రశ్నలు? ఓ అందవిహీనురాలితో జీవితాన్ని పంచుకోడానికి ఎవరూ అంగీకరించరు. అంగీకరిస్తారనుకోవడం వెర్రితనమే— అందుకే ఆ ఆశలకు ఏనాడో సమాధి కట్టాను— ఆడమనసులోని వ్యూహాల్ని ఎప్పుడో తుడిచివేశాను." ఆమె కళ్ళవెంట నీళ్ళు ధారా వాహికంగా కారిపోతున్నాయ్.

అతను కలవరపడ్డాడు ఆమె కన్నీళ్ళను చూసి.

"భయపడకండి, మనిషికి ఏమీ చేతగానప్పుడు మిగిలేవే ఈ కన్నీళ్ళు. వీటికి నా జీవితంపై ఎక్కువ ఆధారముంది కళ్ళు తుడుచుకుని నవ్వింది సుజాత.

ఆమె మాటలు ఆమె పరిస్థితి అతనికి జాలినీ, కరుణను రగిలిస్తున్నాయి.

మరో రెండు నిమిషాలు వారి మధ్య మాటలు కరు వయ్యాయి.

"వస్తానండి, మళ్ళీ కలుస్తాను—మరోసారి ఆలోచించుకోమని కోరుతున్నాను-" అని శెలవు తీసుకుని క్రిందికి దిగి

వస్తుండగా హేమాదేవి యెదురయింది. చంద్రమోహన్ని చూస్తూనే ఆమె కనుబొమ్మలు ముడిపడ్డాయి.

"మళ్ళీ ఎందుకొచ్చావ్? తీక్షణంగా చూసింది.

అతను ఏ మాత్రం జంక లేదు.

ఆ మాట అడగడానికి నీవెవరు-"

"పళ్ళు దగ్గరుంచుకుని మాట్లాడు. నా ఇంటికి వచ్చి నన్నే ప్రశ్నిస్తావా?"

"నీ ఇంటికీ రాలేను. నీకోసమూ రాలేను-" అనేసి వెళ్ళిపోయాడు.

హేమాదేవి ఆ నిర్లక్ష్యాన్ని భరించలేక పోయింది-పళ్ళు పటపట కొరికింది.

వళ్ళంతా కత్తిలేని కారం పూసుకున్నట్లు చిందులు త్రొక్కింది.

ఇదంతా పైనుంచి చూస్తున్న సుజాత లేలిగ్గా గుంభనంగా నవ్వేసింది. సుజాత నవ్వడం హేమాదేవి చూడలేదు-చూస్తే పెద్ద గొడవే లేవదీసేది.

# 11

"యెందుకింత నమ్మక ద్రోహం చేసావు?"

'ఏమిటి కృష్ణా నీవు మాట్లాడేది-" తెల్లబోయి చూసింది కృష్ణ వంక వాహిని.

"అంత ఇష్టం లేని దానివి, రానని ముందే చెప్ప వచ్చుగా నీకోసం యెదురు చూసి యెంతగా నిరుత్సాహ పడిపోయానో నీకేం తెలుసు-"

కృష్ణ మాట్లాడేదేమిటో బోధపడింది వాహినికి.

"ఓస్! నిన్న పార్టీ విషయమా? రావాలనే అను కున్నాను, కానీ, తీరలేదు," నిన్న పార్టీకి తాను రావడం, ద్వారం వద్దే అవమానింపబడి తిరిగి వచ్చిన సంగతి అతనితో చెప్పి, అతని మనసు నొప్పిడం యిష్టంలేక అలా అన్నది వాహిని.

"నా కంటే నీకు అవన్నీ ఎక్కువా"

"ఏవన్నీ! అతన్ని నవ్వించాలని ప్రయత్నిస్తూ హాస్యంగా అన్నది.

అతను మాట్లాడ లేదు. బుంగమూతి పెట్టాడు అలిగి నట్లు.

"సారీ, కృష్ణా నిన్ను చాలా డిసప్పాయింట్ చేసినట్లు న్నాను. క్షమించు రాకూడదనేమీ లేదు. అనుకోని అవం తరం వచ్చిపడి నిన్ను కలుసుకోలేక పోయాను. అన్నట్లు నేను పంపిన బహుమతిని చూసావా?"

"బహుమతా లేదే?"

"అదే. నీ కిష్టమైన కృష్ణశాస్త్రిగారి "మేఘమాల" పంపాను మీ నౌకరుచేత-"

"ఈ విషయం నీవు చెప్పేదాకా నాకు తెలీదు. అయినా నౌకర్ల ద్వారా పంపితే ఎంతయిష్టమైన వస్తువు అయినా అప్రియమైపోతుంది-"

"మరి?"

"స్వయంగా నీ చేతులతో ఇస్తే కలిగే ఆనందం-అను భూతి వేరు-"

"సారీ. ఇకముందు అలా చేయనులే."

కొద్ది సేపటికి అన్నీ మరిచి కబుర్లలో పడ్డాడు కృష్ణ, వాహిని ఆసక్తిగా వింటోంది.

"కృష్ణ... ఓ పాట పాడవూ?"

"అబ్బా, ఆశ...!" నవ్వాడు కృష్ణ అందంగా.

వాహిని పిచ్చిదయి పోయింది ఆ నవ్వు చూసి- "మోహం పుట్టించే ఈ నవ్వును సొంతం చేసుకోగలదా? ఆకాశానికి నిచ్చెనలు వేస్తుందా? ఇతనితో చనువు పెంచుకుని ముందుకు వెళ్ళడం అవివేకమే మో! వాళ్ళ సిరిసంపదలకు తను సరి తూగగలదా! వాళ్ళ నాన్న మా ప్రేమను హర్షిస్తాడా! నిన్న చూడనే చూసింది ఆయన దర్పాన్ని, హోదాని, తెలిసి తెలిసీ ఎందుకితని ఆకర్షణలో పడి కొట్టుకుపోతుంది? దేనికీ అత్యాశలు?

"ఏమిటి డియర్ ...చింతిస్తున్నావు?" కృష్ణ నవ్వుతూ ఆమె భుజం మీద చేయి వేశాడు. ఆ స్పర్శ ఆమెను నిలువనీయలేదు. ఉద్వేగంతో అతన్ని చుట్టుకుపోయి ఏడ్చేసింది. అనుకోని ఈ చర్యకు కృష్ణ కంగారుపడిపోయాడు.

"వాహినీ...వాహినీ! ఏమిటిది?"

ఆమె పలక లేదు. అలాగే అతని ఎదపై వాలి వెక్కి వెక్కి ఏడుస్తూవుంది.

"ప్లీజ్! వాహిని ఏం జరిగింది. ఊరుకో-" ప్రేమగా లేవనెత్తుతూ అడిగాడు.

"కృష్ణా? నిన్నో వరంఅడగమంటావా." జాలిగా అర్థింపుగా అడిగింది.

వాహినీ! నీ మాటలు—చేష్టలు నాకు అర్థం కావడం లేదు. ఎందుకిలా వున్నట్లుండి ఏడ్చేశావు. ఏమయింది నీకు."

"నన్ను దూరం చేయవు కదూ."

"ఏమిటా పిచ్చిప్రశ్న? ఎవరన్నారు. నా కంఠంలో ప్రాణమున్నంతవరకూ నిన్ను దూరం చేసుకోలేను. చేసుకుని బ్రతకలేను. నీమీద వున్న ప్రేమనురాగాల్ని వివరించిచెప్ప లేను వాహినీ. నిజం-" ఆమె చేతిని తనచేతిని తన చేతుల్లోకి తీసుకుని నిమిరాడు.

ఆమె కళ్ళు మెరిశాయి "కృష్ణా! దేనికో నా మనసు కలవరపడుతోంది. నీవు నాకు కావాలి. నీ ప్రేమ నాకే సొంతం కావాలి. ఇది అత్యాశే గానీ నాకు మాత్రం నీవు కావాలి లేకుంటే నేను జీవించలేను-"

"ఊరుకో, పిచ్చిపిల్లా! ఈకృష్ణుడు ఎప్పుడూ ఈ ప్రియమైన వాహినీ ప్రియుడే-" అంటూ ఆమె బుగ్గలు గిల్లాడు చిలిపిగా.

"ఏమో ఎవరికి తెలుస్తాయి నీ లీలలు, నేను గాక మరెందరో."

"పదహారు వేలమందిలో నీవే ప్రియమైన భామవు-" ఫక్కున నవ్వేశాడు.

ఆమె నవ్వింది వెన్నెల కురిసినట్లు చల్లాగా.

ఆ సాయంత్రం ఇంటికి వెళుతూనే నౌకర్లను పిలిచి అడిగాడు,

ఎవరూ పెదవి కదపలేదు. మాకేమీ తెలియదన్నట్లు పిచ్చి చూపులు చూశారు. పుస్తకం మట్టిపాలు చేసిన నవ్వు

కరుకు మాత్రం వణుకు పుట్టింది. తను చేసిన తప్పు ఎక్కడ బయటపడుతుందోనని.

"మాట్లాడరేం, మర్యాదగా ఆ పుస్తకం ఎవరివద్ద వుందో తెచ్చి ఇవ్వండి. లేకుంటే అందరికీ మూడుతుంది. జాగ్రత్త" అని బోకరిస్తూ లోనికి వెళ్ళిపోయాడు కృష్ణ.

అందరి గుండెల్లోనూ రాయిపడింది. చినబాబుగారికి సామాన్యంగా కోపం రాదు.వస్తే ఎంతతీవ్రంగా వుంటుందో అందరికీ తెలుసు అందుకే అందరి గుండెలూ గుబగుబమంటు న్నాయి. ఎవరో తమలో ఒక్కడు చేసిన వెధవపనికి అంద రికీ మూడేట్లువుంది. ఒకర్ని ఒకరు తినేసేలా చూసుకుంటు న్నారు.

అసలు పుస్తకం పారేసిన నవకరు ఈ విధంగా అను కున్నాడు: 'అనవసరంగా పుస్తకం అవతల పారేసి గొంతు మీదకు తెచ్చుకున్నాను. చినబాబుగారు కోపమొస్తే చండ శాసనుడు రేపు ఆమెను తీసుకువచ్చి పుస్తకం ఎవరికి ఇచ్చా వని అడిగితే ఆమె తనను తప్పక గుర్తుబడుతుంది. తనకు తన్నులు తప్పవు. ఉద్యోగం పోవడం ఖాయం అంతకన్నా ఆ పుస్తకం వెదికి తీసికెళ్ళి చినబాబుగారి కాళ్ళమీద పడ డమే మంచిది' అని అనుకొని ఏదో పనివున్నవాడిలా బయ టకు వెళ్ళి గోడవారగా వెదికాడు. అదృష్టవశాత్తు పుస్తకం కనిపించింది. వాడి ప్రాణం కుదుటబడింది దాన్ని చూస్తూనే భద్రంగా తీసి దుమ్ము దులిపి కృష్ణ గదిలోకి వచ్చాడు.

"చినబాబుగారూ! మన్నించాలి, ఇదిగోనండీ ఆయమ్మ ఇచ్చిన పుస్తకం——" వినయంగా టేబిల్‌మీద పెట్టాడు

కృష్ణ దాన్ని అభిమానంగా చటుక్కున అందుకుని తిరగ వేసాడు. తొలి పేజీలో ముత్యాల పోగుల్లా వున్న వాహిని అక్షరాలను చదువుకున్నాడు. "నా ప్రాణంలో ప్రాణానికి... ఊపిరియైన ప్రియతమ కృష్ణబాబుకి ఈ దీనురాలి చిరు కానుక" ప్రేమతో వాహిని అని వుంది.

"ఎక్కడ దొరికింది?"

"పొరపాటయింది మన్నించాలి బాబూ! నిన్న ఆ యమ్మ తెచ్చి యిచ్చింది మీకు యిమ్మని నేను మరిచిపోయి లోపల గదిలో పెట్టాను. ఎవరో తీసి అవతల పారేశారు. ఇప్పుడు మీరు కోప్పడుతుంటే గుర్తుకువచ్చి. ఇల్లంతా గాలించి తెచ్చాను" భయంతో కళ్ళు నములుతూ చెప్పాడు వినయంగా.

"ఏమిటీ నిన్న, వాహిని వచ్చిందా?"

"అవును బాబూ!"

కృష్ణ కళ్ళు క్రోధాన్ని వెలిగక్కుతున్నాయి. వాహిని వచ్చిన సంగతి తనకు చెప్పనందుకు చివ్వున కోపం తలెత్తింది. వాడిని అక్కడికక్కడే నిలువుగా పాతేయాలన్న ఉద్రేకం కలిగింది-తమాయించుకున్నాడు.

"రాస్కెల్! ఆ విషయం నా కెందుకు చెప్పలేదురా"

"పెదబాబుగారే, ఆ యమ్మని లోనికి రానివ్వలేదండీ" ఇంతలో తన తప్పేమీ లేదన్నట్లు కంపించిపోతూ చెప్పాడు.

"ఏమిటీ నాన్నగారు వాహినిని లోనికి రానివ్వలేదా? ఎందుకిలాచేశారు? అయ్యో! వాహినీని వెంత మంచిదానవు. నా యింటికివచ్చి అవమానం పొందికూడా నాతో చెప్ప కుండా దాచేసావు దేనికి? నేను బాధపడిపోతానని నీవు భరించావా!" బాధగా నుదురు కొట్టుకున్నాడు.

చినబాబుగారు ఆలోచనలలో పడడం గ్రహించి నౌకరు మెల్లగా జారుకున్నాడు.

తనకోసం వచ్చిన స్నేహితురాల్ని ప్రాణ సమానురాల్ని, ప్రియవల్లరిని అవమానించి గెంటేసిన తండ్రిమీద చెప్పరాని ఆగ్రహంకలిగింది కృష్ణకు. తండ్రి ఇంటికిరాగానే నిలదీసాడు.

"ఎందుకిలా చేసారు? ఆ అమ్మాయి ఎంత బాధ పడిందో గ్రహించారా? అభిమానంతో ఇంటికి వచ్చిన వాళ్ళను యిలాగేనా సత్కరించేది?" కోపంతో కృష్ణ ముఖం ఎర్రబారింది.

"ఏమిటి కృష్ణా ఎందుకంత ఉద్రేక పడిపోతావ్? ఎవరూ? నిన్న వచ్చిన ఆ అమ్మాయేనా? ఆ అమ్మాయి యెక్కడ కంటపడింది నీకు?"

"మీరు చేసినపని బాగోలేదు. రేపు ఆ అమ్మాయి ఎదుట యెలా తలెత్తుకు తిరగను?"

"బావుంది నీ అర్థంలేని బాధ. అయినా అలాంటి వాళ్ళతో నీకు స్నేహా లేమిట్రా? మన అంతస్తూ, హోదాకు

తగినవాళ్ళతో స్నేహం చేయాలిగానీ, ఓ సామాన్య యువతితో స్నేహం చేయడమనేది మన వంశంలోనే లేదు. వాళ్ళకి మన ప్రక్కన కూర్చోడానికి కూడా అర్హత లేదు."

రామనాథంగారి అహంకారపూరితమయిన మాటలకు కృష్ణ హృదయం గాయపడింది.

"తప్పనాన్నా! వాళ్ళూ మనుషులే-మరీ అంత చులకనగా మాట్లాడకండి! మనకున్నపాటి ఆస్తీ అంతస్తూ లేకున్నా మానాభిమానాలు కలవాళ్ళు. ఇంకెప్పుడూ ఎవరివాళ్ళను కించపరిచేట్లు మాట్లాడకండి. మన మాటల వల్లే మనకున్న సంస్కారమేపాటిదో బయటపడిపోతుంది" అనేసి అక్కడ వుండటం యిష్టంలేక చరచరా తన గదిలోకి వెళ్ళిపోయాడు కృష్ణ.

రామనాథంగారి బుర్ర చురుగ్గా పనిచేసింది. "వీడెందుకింత ఆవేశపడుతున్నాడు? కొంపదీసి ఆ అమ్మాయిని ప్రేమిస్తున్నానని అనలేదు. సంతోషమే! ఇప్పుడిక సంతోషపడితే సరిపోదు. ముందుముందు ఎదుగుతున్నవాడు ఏం చేసినా తను ఆశ్చర్యపోనక్కర్లేదు. కనుక ఆ విషబీజాన్ని ఇప్పుడే తొలగించివేయాలి. చేతులుకాలాక ఆకులు పట్టుకోకముందే మేలుకోవాలి. ఆ పిల్లకూ, వీడికీ ఏమిటి సంబంధమో ఆరా తీయాలి, ఆట కట్టించాలి అని అనుకున్నారు.

# 12

పుచ్చపువ్వుల లాంటి వెన్నెల విరగ గాస్తూంది. నెల రాజులు తన చల్లని సానువులలో ప్రజావాహినిని ఓల లాడిస్తూ మైమరపిస్తున్నాడు. నక్షత్ర కన్యలు తమ సోయగాలన్నీ ప్రదర్శిస్తున్నాయి. మిణుకుమిణుకుమంటూ అంతా నిశ్శబ్దం. ప్రపంచం ఆదమరిచి నిద్రలో మునిగిపోయింది. కానీ, అంతమంది జనం సుఖప్రసాదంగా తీసుకుని అనుభవిస్తున్న నిద్రను-చంద్రమోహన్, సుజాత, కృష్ణ, వాహినీలు పొందలేకపోయారు వారి కళ్ళు మూతలు పడడంలేదు. ఆలోచనలతో వేగిపోతున్నారు-వీగిపోతున్నారు.

చంద్రమోహన్ ఆలోచనలు యీ విధంగా సాగిపోతున్నాయ్ ..

"సుజాత ఎందుకలాంటి నిర్ణయానికొచ్చింది? జీవితంపై విరక్తితోనా? అవును విరక్తితోనే! లేకుంటే ఎన్నాళ్ళని ఒంటరి బ్రతుకును నిర్వికారంగా గడిపేస్తుంది. పాపం! ఆమెకూ ఆశలు, కోరికలున్నాయి. కాని వాటిని ఎప్పటికప్పుడు త్రుంచేసుకుంటుంది. పోనీ ఎవరన్నా మంచివ్యక్తిని చూసి పెళ్ళిచేస్తే? ఎవరు చేసుకుంటారు? ఆమె బాధ పడు

తుందని అలా అన్నాడు గాని, ఏ యువకుడు ముందుకు వచ్చి, ఆమె మెడలో తాళి కట్టి ఆమె బాధ్యతను స్వీకరించగలడు? ఈ రోజుల్లో అన్నీ సక్రమంగా వున్న ఆడపిల్లలకే పెళ్ళిళ్ళు కావడం మహా కష్టంగావుంది. ఇక సుజాతలాంటి అభాగినులకు విముక్తి దొరుకుతుందా?"

"ఎందుకా పనికిరాని ఆలోచనలు? ఆమె నీకేమవుతుందని యింతగా ఆ విషయాన్ని గురించి బాధపడి పోతున్నావ్?" అని అతని అంతరాత్మ ప్రశ్నించింది.

అవును ఆమె తనకేమవుతుంది? ఏమిటి సంబంధం? మనిషికీ మనిషికి మధ్యన వున్న అనుబంధమే ఆమెను గురించి ఆలోచింపచేస్తుంది నా చేత. ఓ మంచి మిత్రునిగా ఆమె మేలు కోరుతున్నాను. హృదయస్పందనే ఎరుగని ఆమెచీకటి హృదయంలో దీపం వెలిగించి, ఆమె జీవితాన్ని చక్కబరచాలని ఆలోచిస్తున్నాడు ఇందులో తప్పు లేదే?" అని తనకు తాను చెప్పుకున్నాడు.

"ఊరికే ఆలోచిస్తే ప్రయోజనం లేదు. నీకునిజంగా ఆమెమీద అభిమానం, జాలీ వుంటే నీవే ఎందుకు ఆమెను చేసుకుని ఉద్ధరించకూడదు?"

అంతరాత్మ సూటిప్రశ్నకు అదిరి పడ్డాడు.

"నేనా"

"ఏం నీవే ఎందుకు చేసుకో కూడదు? ఆమెకేం తక్కువ?"

"నా మాటలు నాకే అప్పగిస్తున్నావ్?"

"ఓ అభాగ్యురాలికోసం ఆ మాత్రం త్యాగం చేయలేవా?"

"నో నా కలాంటి ఆలోచనలు లేవు—"

"లేకపోవచ్చును. ఇప్పుడు ఆలోచించుకో. మోడు వారిన ఆమె జీవితానికో దారి చూపించు, నీ ప్రేమామృతంతో ఆమె జీవనలత పుష్పించేట్లు చేయి. అంతేగానీ, ఊరికే జాలి సానుభూతి చూపిస్తే ఆమెకు ఒరిగేదేమీ లేదు. ధైర్యముంటే ముందుకు నడిచి ఆమెను చేపట్టు.

చంద్రమోహన్ విస్తుపోయాడు. తన ఆత్మ వేసే ప్రశ్నలకు-

"అవును నిజమే! తనే ఎందుకు సుజాతను చేసుకోకూడదు? తనంటే ఆమెకు ఎంత ఇష్టమో మాటలతో వ్యక్తీకరించ లేక చేతలతో, కన్నులతో వ్యక్తం చేస్తుంది. తనను ప్రేమిస్తుందేమో! తనను చూసినప్పటినుండీ చాలా ఉత్సాహంగా ఉల్లాసంగా వుంటుంది. దేనికి? చీకటి బ్రతుక్కి తోడు దొరికానని మురుస్తుందా? లేక కేవలం స్నేహ భావమేనా? అసలు తను సుజాతను చేసుకోగలడా? మనస్ఫూర్తిగా తన జీవితంలోకి ఆహ్వానించగలడా! ఎందుకీ విచిత్రపు టాలోచనలు? ఆమె ఏమనుకుంటుంది? ఏమయినా ఇన్నాళ్ళూ తనకా ఆలోచనలు

కలగలేదు. ఇప్పుడిప్పుడే అలాంటి ఆలోచనలు తనలో స్థావరం ఏర్పరచుకుంటున్నాయి. ఈ ఆలోచనలు క్షణికమే అయితే ఆలోచించాల్సిన పనిలేదు. వేచిచూడాలి మనసు గారకీ-" అని అనుకున్నాడు చంద్రమోహన్.

అక్కడ సుజాత ఊహలు మరోవిధంగా వున్నాయి.

"ఎన్నో రోజులనుంచి అనుకున్న కార్యాన్ని ఇప్పటికైనా చేయగలుగుతున్నాను. చంద్రమోహన్ ఎంతమంచివాడు. తన మనసును బాగాఅర్థంచేసుకున్నాడు. కానీ తన ప్రేమను, అనురాగాన్ని గ్రహించడంలేదు. దేనికి? గ్రహించి కూడా తననుండి దూరమవుతున్నాడా? తనను పెళ్ళిచేసుకుంటాడా? అలాంటి త్యాగం అతను చేయగలడా? ఎందుకు చేయాలి? చేయాలని నీవు ఆశించడంకూడాపొరపాటేతనపై ఆశలు పెంచుకోమని అతను చెప్పలేదే-నీవు అందనిస్వర్గానికి నిచ్చెనలువేస్తున్నావు. ఇది ఎనాటికీ జరగదు. అతనికి నీ మీద ప్రేమలేదు. కేవలం సానుభూతి, దయామాత్రమే.

అతని సమక్షంలో వున్నప్పుడు తనమనస్సు ఎందుకింత తీవ్రంగా స్పందిస్తుంది.పిచ్చిమనసుపరితపిస్తూంది దేనికోసమో నిజంగా అతను తనను స్వీకరించి ఇల్లాలిగా చేపట్టితే! ఓహ్ ఈ జీవితానికి కావాల్సిన భాగ్యమేముంది? అతనిపాదాలవద్ద పువ్వులా రాలిపోతుంది తను. దైవంలా ఆరాధిస్తూంది. అతని ప్రేమను పొందడం గొప్పవరం. అతని కౌగిలిలోకరగడం... భగవాన్ నేను నోరు తెరిచి ఎప్పుడూ ఏమీకోరలేదు.అవిటిదానిగా పుట్టించి ఈ భూమ్మీదపడేశావు. బాధపడుతూనే

ఈ బ్రతుకును లాగేస్తున్నాను. కానీ ఈజన్మకు విముక్తిలేదు. అనుభవిస్తున్నాను ఇప్పుడు అర్థిస్తున్నాను. క్షణమైనాఅతని ఇల్లాలిగా వుండేభాగ్యాన్ని ప్రసాదించుతండ్రీ ఈ దీనురాలి మొర ఆలించు ప్రభూ! లేకుంటే ఈ బ్రతుక్కి విముక్తినైనా ప్రసాదించు. అతనికి దూరమైన జన్మమెందుకు! యీ గుండెల్లోరగిలే ప్రేమజ్వాలను నీవైనా అర్థంచేసుకో-నన్ను కరుంచిణి నా కోరిక ఫలించాలని దీవించు ప్రభూ!" భక్తిపూర్వకంగా రెండుచేతులు జోడించి కనిపించని దేవుడ్ని వేడుకున్నది సుజాత.

ఇక కృష్ణ-వాహినీల పరిస్థితి-

"వాహినీ ఎంత అభిమానవంతురాలు. జరిగినవిషయం తనతో మాటమాత్రంగానైనా చెప్పలేదు. అసలుతనుబాధపడుతున్నట్లే కనిపించలేదు. ఇదంతా తన కోసమే చేసింది. ఎంతటిప్రేమ అభిమానం! తొలిచూపుతోనే తన మనసును ఆకట్టుకుంది. హృదయానికి హృదయం చేరువ అయింది. ఏమైనాసరే ఎన్ని అడ్డంకులు ఎదురయినా వాహినీని దూరం చేసుకోలేను. చేసుకుని బ్రతుకలేను. అందుకే కాబోలు జాలిగా తనను చుట్టుకుపోయి దుఃఖించింది. తను అర్థం చేసుకోలేకపోయాడు నాన్న ఎంత కుసంస్కారి? ఇంటికివచ్చిన ఆత్మీయురాల్ని అవమానించి గెంటివేశాడు. డబ్బువున్నవాళ్ళే మనుషులా? మిగతావాళ్ళంతా ఎందుకూపనికిరాని వాళ్ళు ఆయన దృష్టిలో-ఏంమనిషి! ఇంతసిరిసంపదలున్నాయి ఇంకా సంపాదిస్తున్నాడు దేనికి? మనసుకు తృప్తినివ్వలేని ఈ

భోగభాగ్యాలు దేనికి? వాహినీ విషయం చెబితే నాన్న ఏమవు తాడు అద్భుతగుణుతాడా? తనేనా అంతచేతగానివాడు. ఏమైనాసరే-ఇష్టపడి తన పెద్దరికాన్ని నిలుపుకున్నాడా సరే లేకుంటే ఎదిరించి రిజిష్టర్ మ్యారేజ్ చేసుకుంటాము మా బ్రతుకు మేము బ్రతక్కపోము. రేపు వాహినితో ఈవిషయం మాట్లాడి, నాన్న సంగతికూడా తేల్చుకోవాలి" అని నిర్ణ యించుకున్నాడు కృష్ణబాబు.

మరోచోట వాహిని సతమతమవుతోందిఆలోచనతో

"కృష్ణా! ఎందుకు నన్నిలా చేస్తున్నావు? నామనసును దోచుకుని నన్ను లేనిదాన్ని చేసావు. నా ప్రేమను నీ ప్రేమను నీకెలా నివేదించను. ఈ పేదరాల్ని ఇల్లాలిగా స్వీకరించగలవా? మీ నాన్న...అంతస్థునకోసం ప్రాకులాడే ఆయనకు నేను నచ్చునా? నిన్ను చూడ్డానికి వస్తేనే ఇంటా ట్లోకి రానివ్వలేదు. అలాంటివ్యక్తి నన్నుకోడలుగా ఊహించ గలడా? మరిఎలా? నీవు నాకుకావాలే! నీ పాటలతో కరిగి పోతూ పరవశించిపోవాలన్న తపన! నీహృదయానికి రాణినై ప్రేమరాజ్యాన్ని ఏలాలన్న కాంక్ష! నీ చరణాలను ప్రేమ పుష్పాలతో పూజించి తరించాలన్న కోరిక! ఇంకా ఎన్నో ఆశలు-కలలు. నా కోరికలు తీరేనా? నాకలలు ఫలించేనా? మేము మీతోతూగగలమా? ప్రేమకు తారతమ్యాలు లేవు. అంతస్తులతో మనకు పనిలేదు పరువు-ప్రతిష్టలు మనకు అక్కరలేదు. నీవుకోరితే ఎక్కడికైనాసరే ఆనందంగా నడిచి వస్తాను. ఈ పెద్దలు మన ప్రేమను గుర్తించి పెళ్ళిచేయక

పోతే మనపెళ్ళి మనమే చేసుకుందాం. నిజంగా నన్ను అర్ధాంగిగా స్వీకరిస్తావుకదూ! నా కలల్ని పండిస్తావుగదూ... కృష్ణా నా ప్రేమను ఎలా వ్యక్తంచేయను. మరిగిపోతున్న గుండెను నీ ప్రేమామృతంతో చల్లార్చవా? ఈ ప్రేమ పూజారిణిని కరుణించి నీదాన్ని చేసుకో కృష్ణా! అరమోడ్పు కన్నులతో అనుకుంది వాహిని.

“అవును. మరలా వీడెందుకు వస్తున్నట్లు? కొంపదీసి ఈ కుంటిదాన్ని పిలిపించలేదుగదా? వెధవకు తనంటే లక్ష్యం లేకుండా పోయింది, ఏదో పనికి వస్తాడన్న ఉద్యోగం పేరిట కుంటిదానికి తోడుగా వుండమంటే! తననే నిర్లక్ష్యం చేసాడు, ఆ కుంటిది ఎంత పొగరు దానికి, ఏం చూసుకుని దానికింత ధైర్యం? ఒకవేళ వాడ్ని ప్రేమిస్తుందా? దాని రాచిప్ప ముఖానికి అదొకటే తక్కువ, ఏమో ఎవరు చెప్పగలరు, ఈ మధ్య అది చాలా ఉల్లాసంగా సంబరంగా వున్నట్లు కని పిస్తుంది, అంటే అర్ధమేమిటి? సందేహంలేదు- ప్రేమలోపడే వుంటుంది. సంబడం అది ప్రేమించగానే సరా! వాడికి నచ్చ వద్దూ! ఇంత అందగత్తెనైనా తూలనాడేడు వెధవ, ఇక కురూపిది నచ్చుతుందా! ఏమో దానిఆస్తిచూసిలేని ప్రేమను ఒలకబోసి, దాన్ని వశపరుచుకోడుగదా! ఇప్పటికే అది తనకు ఎదురు తిరుగుతోంది ఇకవాడి ఆసరా దొరికితే తనని లక్ష్యపెడుతుందా? ఒక వేళ వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకుంటే తన గతేం కాను ఆ వెధవ పెత్తనమంతా ఛేజిక్కించు కుంటాడు. తనను పూచిక పుల్లలా తీసిపారేస్తాడు. వీల్లేదు- అలా ఒక్క నాటికీ జరగనివ్వను. కుంటిది కుంటిదానిలాగే

కడివుండాలి పెళ్ళిపెటాకులు దానికెందుకు. ఏమైనా తను చాలా జాగ్రత్తగా వుండాలి ఆ వెధవను ఈ ఇంటి ఛాయలకు రాకుండా చేయాలి. ఎలా? ఏం చేస్తే ఈ వేపుకన్నెత్తి చూడడు? హేమాదేవిలో ఏన్నో భయాలు- సందేహాలు, ప్రశ్నలు.

ఇక లక్షాధికారి రామనాథంగారి మనసు ఈ విధంగా వుంది.

"కృష్ణకు త్వరలో పెళ్ళి చేయాలని పెద్దవాడై పోతున్నాడు ఇప్పుడిప్పుడే ఎదురుతిరగడం నేర్చుకున్నాడు. కొన్నాళ్ళుపోతే తన మాటంటే విలువ లేకుండా పోతుంది. వెధవ చదువులు మూలాన పాడై పోతున్నాడు. చిల్లర జాతి వాళ్ళతో స్నేహాలు ఎంతదూరమవుతుందో- అందుకే త్వరగా పెళ్ళిచేసేసి బాధ్యతలు నెత్తిన రుద్దాలి. అయినా వాడికి చదువు దేనికి? చదివి ఎవర్ని ఉద్ధరించాలి వాడు-వాడి పిల్లలు-మనవలు కూర్చుని తిన్నా తరగనంత అస్తి పేరుకుని పోయింది. భగవంతుని దయవల్ల ఇంతసంపాదించి కూడబెట్ట గలిగాను. చిన్నపిల్లాడు వయసులోవున్నాడు. ఏవగలాడైనా వల విసిరి డబ్బు కోసం లోబరుచుకోవచ్చును. పిచ్చిసన్యాసి వాడికేం తెలుసు. అదంతా ప్రేమేనని పొంగిపోతాడు. కనుక అంతదూరం రాకముందే తను జాగ్రత్త పడాలి-" అని అనుకున్నాడు.

అందరూ ఆశలు పెంచుకుంటారు. కానీ చిత్రమేమిటంటే ఎవరి అదృష్టం కొద్ది వాళ్ళ ఆశలు ఫలిస్తాయి. అంతటితో ఊరుకోరు. కొత్తఆశ- మరోటి—— ఇలా మనిషిజీవిత

కాలంలో ఒకదాని వెంట ఒకటి పేర్చుకుంటూనే పోతాడు. కాలం కలిసివస్తే ఆ ఆశలు నెరవేరవచ్చు. కొన్ని ఎండ మావుల్లా మిగిలిపోనూవచ్చు. అదృష్టవంతులు తమ తెలివి తేటలలో బ్రతుకులు బంగారు బాటగా మలచుకుని ఆశల్ని తీర్చుకుంటూ సుఖిస్తున్నారు. దురదృష్టవంతులు వెనకబడి ఏడుస్తున్నారు. ఒక్కసారి భంగపాటు చెందికూడా, అలాంటి కోరికల్ని చంపుకోలేరు. ఏమిటీ ఈ మానవ జీవితాలు! సాగి పోతున్న జీవానందలహరిలో ఎన్నో బుడగలు ఉద్భవిస్తుం టాయి. మరుక్షణంలో అవి అంతరిస్తూ కొత్త బుడగలు పుడుతూ, పగిలిపోతూ, చిట్లిపోతూ- అంతా అగమ్యగోచరం ఈ ఆశలు కూడా అంతే, ఒక దాని వెంట ఒకటి పుడు తూనే వుంటాయి. అంతూ దరీ లేదు వీటికి. జీవితంలోనే ఇది పరిసమాప్తి అయ్యేది. అంతవరకూ తప్పవు ఆశల సమరం, ఈ జీవన తరంగాలలో ఆశల నౌకలు ఏ వేపున పయనించి, యే సుందర తీరాన్ని చేరుకుంటాయో కాలమేనిర్ణయించాలి! లేక విషమయ దీవులనే చేరుకుంటాయో!

రాత్రి సగంగడిచిపోయింది. ఆలోచనలలో వేడెక్కిన బుర్రలు- తాము తీసుకున్న నిర్ణయాలతో ఊహించుకున్న స్వర్గాలతో చల్లబడ్డాయి. నెమ్మదిగా నిద్రాదేవి ఒడిలో సేద దీరసాగేరు. అదృష్టవంతుల్నీ-దురదృష్టుల్నీ పక్షపాతం లేకుండా సమదృష్టితో ఓలలాడిస్తున్నాడు సుధాకరుడు. ఊరు మాటు మణిగిందని తారాభామలు ఆయన చుట్టూ చేరాయి సరసానికి.

# 13

ఉదయం కాలకృత్యాలు ముగించుకుని, కాఫీటిఫెన్‌ల పూర్తి చేసుకుని ఫ్రెష్‌గా స్నానం చేసింది. సుజాత మేడ మీద డాబా వారగా కుర్చీని జరుపుని రోడ్డు మీద వచ్చే పోయే జనాని చూస్తూ కూర్చుంది. చంద్రమోహాన్ వస్తాడే మోనని ఎదురుచూస్తుంది. చాలా సేపటినుంచి కోడలిపై భవం గమనించిన హేమాదేవికి ఏదో అనుమానం కల్గింది. దగ్గరగా వచ్చి కుర్చీ లాక్కుని కూర్చుంది.

"ఏమ్మా సుజా! ఎవరికోసం ఎదురు చూస్తున్నావు?" ప్రేమ వలకబోస్తూ నవ్వుతూ అడిగింది.

"నీకెందుకీ ఆరాలు?" అన్నట్లుచూసిందేగానీ సుజాత పెదవి కదపలేదు.

చంద్రా వస్తానన్నాడా?" మళ్ళీ తనే కల్పించుకుంది కూపీ తీయడానికి.

"అతనెందుకు వస్తాడు? నీవు రావద్దని చెప్పావుగా! ఆ మాత్రం అభిమానం లేదా ఏమిటతనికి?"

"మరి నిన్నెందుకు వచ్చాడు?"

"నేను పిలిపిస్తే వచ్చాడు-"

"నీవు పిలిపించావా? దేనికి?"

"ఏమీ తోయక-" విసుకగా అన్నది. అసలా ప్రశ్నలు ఎందుకు అడుగుతున్నదో అర్థం కా లేదు సుజాతకు.

'ఎప్పటి కప్పుడు చెబుదామనే అనుకుంటున్నాను. కానీ, ఏది తీరిక దొరక లేదు గదా?"

ఏమటని సుజాత ప్రశ్నించ లేదు, అసలామె మాటల పట్ల ఆసక్తి లేని దానిలా రోడ్డు మీదకే చూస్తూ కూర్చుంది- "తను మంచి విషయం చెబుదామనుకుంటే ఇదేమిలా బిర బిగుసుకుంది!" అని హేమాదేవికి కోపం వచ్చినా తమా యించుకుంది. పెదాలపైన నవ్వును పులుముకుంటూ తిరిగి తానే అన్నది.

"ఏమిటి సుజా! అంతపరధ్యాన్యంగా వున్నా వేమిటి?"

"నా మనసేమీ బాగో లేదు. నన్ను విసిగించకు" కసురు కున్నట్లే ముఖం చిట్లించి అన్నది.

"మనసు బాగా లేదా సరే, మళ్ళీ చెబుతాలే" అని లేచిపోయింది హేమాదేవి.

పళ్ళు కొరుక్కుంది కసిగా సుజాత.

* * *

"బాబూ కృష్ణా! ఈ ఫోటో చూడు" ఫోటో అందిస్తూ అన్నాడు రామనాథంగారు.

కృష్ణ ఏమిటోనని పరధ్యాన్నంగా దాన్ని అందుకుని తేరిపారా చూచాడు. ఫొటోలోవున్న అమ్మాయి అందంగా ఫేషన్‌గావుంది. ఆఅమ్మాయి ఎవరో. తండ్రితనను చూడ మనడంలోగల ఆంతర్యం కృష్ణకు బోధపడ్లేదు.

"వరిదినాన్నా ఈఫోటో?"

"కరుణాకరరావని పెద్ద జమీందారువంశంలే,ఒక్కతే కూతురు, బోలెడంత అస్తి మర్యాదస్తుల కుటుంబం, అందానికితగ్గ అణుకువ పదిదాకి చదివిందట" చెప్పుపోతున్నాడు వివరాలు. తండ్రి మనసు తెలిసిపోయింది కృష్ణకు.

"అయితే ఏం చేద్దామంటావు?"చిరాకుగా ఫోటోను టేబిల్ మీదవేస్తూ అన్నాడు కృష్ణ.

"రేపోసారి వాళ్ళింటికెళ్ళాంవచ్చిచూసిపొమ్మని ఒకటే గొడవపెడుతున్నారు ఏమంటావు?"

"అయితే యింకే వెళ్ళిరండి వాళ్ళంతగా కోరుతున్నపుడు వెళ్ళకపోతే బావుండదు."

"నేను వెళ్ళడమేమిటి మతిలేనిమాటలు పెళ్ళి నీకా నాకా" కొంచం ఉద్రేకంగా అన్నారు.

"పెళ్ళి చూపులన్న మాట మరి అలా చెప్పరేం" వ్యంగ్యంగా అన్నాడు అతడు.

కొడుకు నిర్లక్ష్యవైఖరి రామనాథంగారికి కోపం తెప్పిస్తున్నా, నిగ్రహించుకుంటున్నారు, సాధ్యమైనంత సవ్యంగా సమస్యను పరిష్కరించాలని ఆయన ఉద్దేశ్యం.

"వెళ్ళి చూద్దాం నీకు నచ్చితేనే చేసుకుందువు యింతలో నేకొంపలు మునిగిపోయేదేముంది. రేపు వెళదాం కాలేజీకి సెలవు పెట్టు."

"కట్నం ఏమాత్రం ఇస్తారో?"

"ఉన్నది ఒక్కపిల్ల వాళ్ళ ఆస్తిపాస్తులన్నీ నీకే దక్కుతాయి."

'అదే అడుగుతున్నా-సుమారు ఏమాత్రం ఉండవచ్చు'

కొడుకు దారికివస్తున్నాడని మురిసిపోతూ హుషారుగా చెప్పసాగారు రామనాథంగారు'

"నాలుగైదులక్షలవిలువజేసే ఆస్తివుంది ఇంకా..." తండ్రిమాట పూర్తిగాకముందే అందుకున్నాడు అతను.

"వాళ్ళవినాలుగులక్షలు మనవి ఎంతలేదన్నా ఐదారు లక్షలు. అంటేమొత్తంపదిలక్షలన్నా జమకూడుతుందన్న మాట నాన్నా-"

"ఏం బాబూ ఏమిటిసందేహం" చిరునవ్వుతో అడిగారు

"నాకు తెలియకన్తుగుతాను ఇన్ని లక్షలు నేనేం చేసు కోను?"

"అదేంపిచ్చి ప్రశ్నరా! ఈ రోజుల్లో ఎంతడబ్బు ప్రోగు చేస్తే అంతస్తు అంతపైకి పెరుగుతుంది సంఘంలో పేరు పలుకు బడీ వస్తాయి. డబ్బు లేనివాడు దుబ్బుకుకొరగాడని సామెత వుండనే వుందిగా"

"అయితే డబ్బుతో కొనుక్కునే ఈ అంతస్తులు నాకు వద్దు మీరు అట్టే శ్రమపడకండి నాకోసం. నా బ్రతుకు నేను బ్రతగ్గలను. నన్నిలాగే వుండనివ్వండి-"

కొడుకుమాటలకు అదిరిపడ్డారు రామనాథంగారు. "దారికివస్తున్నాడనుకుంటేఇలాఎదురుతిరుగుతున్నాడేమిటి?" అని ఆయనకు కోపం బుస్సున పొంగింది.

"ఇంతకూ నీవుమాట్లాడేదేమిట్రా?"

"నా పెళ్ళివిషయంలో మీరేమీ హైరాన పడవద్దని హెచ్చరిస్తున్నాను-తగినజోడు ఎప్పుడో వెదికిపెట్టుకున్నాను ఇష్టపడిచేస్తే ఒకటవుతాం—లేకున్నా అవుతాం ఆలుమగలం" అనేసి పుస్తకాలుతీసుకొని వెళ్ళిపోయాడు కృష్ణ.

రామనాథంగారి హృదయం కుతకుత ఉడికిపోయింది. "దౌర్భాగ్యుడు అన్నంతపనీ చేసేలావున్నాడునాలుగులక్షలు ఇచ్చి లక్షణంగా పిల్లనిస్తామంటే వద్దంటాడేమిటి? జోడుచూసి పెట్టుకున్నాడట ఎవరది? ఇంకెవరు? అదే అయివుంటుంది దాని సంగతేమిటో యిప్పుడే తేల్చేస్తాను. ఈ రామనాథ

మంటే యేమనుకున్నాడో రుచిజూపిస్తాను" విసురుగా పైపంచ బుజాన వేసుకొని కాలేజీకి బయలుదేరారు.

"నమస్కారం ప్రిన్సిపాల్ గారూ!"

"ఓ ..మీరా!నమస్కారం... రండి రండి" కుర్చీ చూపించాడు గౌరవంగా ప్రిన్సిపాల్.

"ఆఁ చెప్పండి. ఏమిటిలా ఉరుములూ, మెరుపులూ లేనివానలా వచ్చారు" నవ్వుతూ అడిగాడు ప్రిన్సిపాల్. రామనాధంగారుకూడా నవ్వారు ఆయన మాటలకు.

"ఏం రాకూడదా?"

"అబ్బే! ఎంతమాట!ఇంతకూ ఏంపని మీాదవాచ్చారో అబ్బాయిని పిలిపించమంటారా?"

"వద్దుమీాతోనే నా పని..."

"నాతోనా? చెప్పండి_" డ్రాయర్ మీాద చేతులు ఆన్చి ముందుకు వరిగికూర్చున్నాడు ప్రిన్సిపాల్.

"ఏంలేదు, అబ్బాయిచదువుసంధ్యలుఎలాఉన్నాయో తెలుసుకుందామని."

"కృష్ణకేమండీ జెమ్సులాంటి కుర్రాడు. అన్నిసబక్టుల్లోనూ అతనేఫస్టు. సైన్సులో మంచిఅభిరుచివుంది. డాక్టరీ చదివించండి మంచివృద్ధిలోకి వస్తాడు."

"ఆ... ఏం చదువులో లేండి. బతకలేని వాళ్ళకే గానీ ఈ చదువులు మాబోటివాళ్ళకు దేనికయ్యా ఎవర్ని ఉద్ధరించాలి"

"అలా అనకండి బ్రతుకుదెరువు కోసమేననిగాదు." విజ్ఞానంకోసం...."

"వచ్చిన విజ్ఞానం చాల్లే ఈ ఏటితో చదువుమాన్పించేసి పెళ్ళిచేయాలనుకుంటున్నాను." ప్రిన్సిపాల్ గారి మాటలుపూర్తికాకుండానే మధ్యలో అందుకుని అన్నారు రామనాథంగారు.

కృష్ణకు పెళ్ళిచేస్తారా? అప్పుడే పెళ్ళేమిటండీ-సరిగ్గా గడ్డాలు మీసాలుకూడ రానిదే-" ప్రిన్సిపాల్ గారునవ్వారు ఆయనతో జతకలిపారు రామనాథంగారు.

"గడ్డాలుమీసాలు రాకముందునుంచే ప్రేమపాఠాలు నేర్చుకుంటున్నారు ఈ కాలం పిల్లలు, అదేమంటే మేం ప్రేమించుకున్నాం. పెళ్ళి చేసుకుంటాం అంటారు. ఈ గొడవలన్నీ లేకుండా వయసులోనే పెళ్ళిచేస్తే పోలా?"

"అంటే కృష్ణ ఎవరినన్నా ప్రేమించాడా."

"ప్రేమా లేదూ వాడి బొందా లేదు. ఎవరో మీ కాలేజీ పిల్లేనట. మావాడి వెంటబడింది ప్రేమ అంటూ-ఈ అమాయకపు వెధవ అది నిజమేనని నమ్మేసి దానితోబడి తిరుగుతున్నాడు చదువు సంధ్యలు గాలికి వదిలేశాడు-"

"మా కాలేజీ అమ్మాయా ? ఎవరై వుంటారబ్బా ! ఈ విషయం మీరు చెప్పేదాకా నాకు తెలియదు" అని ఆలోచల్లో పడ్డాడు ప్రిన్సిపాల్.

"ఆ పిల్ల ఎవరో కూపితీసి నాలుగు చివాట్లు పెట్టండి. బుద్ధిమంతుడైన నా కొడుకు దీని వల్లోపడి నన్నే ఎదిరించే స్థితికి వచ్చాడు. ఆపిల్లపై తక్షణమే చర్య తీసుకోండి వస్తానండీ, ఆ విషయం మర్చిపోవద్దు—" అని లేచాడు రామనాథంగారు

"అలాగే! ఆ విషయం నేను కనుక్కుంటాను లెండి—" అని ద్వారం దాకా వచ్చి సాగనంపి లోనికి వచ్చాడు ప్రిన్సిపాల్.

ఆతరువాత కాలేజీలో పిల్లల్ని కొందర్ని, లెక్చరర్స్‌ని పిలిచి వివరించాడు. చివరకు తేలిదేమంటే కృష్ణతో అంత చనువుగా వుండేవారు ఎవరూ లేరు వాహినీ తప్ప! అని ఆమెనని అందరూ బలపరిచారు.

వాహినీని పిలిచి ముఖం వాచేదాకా చివాట్లు పెట్టాడు ప్రిన్సిపాల్.

మీరు కాలేజీకి వచ్చేది చదువుకోడానికి కానీ, పిచ్చి పిచ్చి ప్రేమంటూ తిరిగితే సహించేది లేదు. చదువుకుంటున్నారు. ఆ మాత్రం బుద్ధి జ్ఞానం వుండక్కర్లెదూ! అయినా ఈ పసివయసులో మీకు ప్రేమలేమిటి? అసలు ఆ పదానికి

అర్థం తెలుసా- ఇంకెప్పుడైనా నీవు కృష్ణతో కలసి తిరిగినట్లు తెలిస్తే కాలేజీ నుండి తొలగించాల్సివస్తుంది జాగ్రత్త ఇంత వరకూ ఈ కాలేజీని గురించి మంచి పేరే వుంది. మీ లాంటి వళ్ళవలన చెడ్డపేరు వస్తుంది. కాస్త వళ్ళు దగ్గర పెట్టుకుని ప్రవర్తించు" అని చెడా-మడా అరిచాడు

వాహినికి నోట మాట రాలేదు. కళ్ళలో నీళ్ళు నిలిచాయి.

నోరు తెరిచి ఏదో చెప్పాలనుకున్నది కానీ, ఆయన రౌద్రం చూసి గొంతు పెగల్లేదు- సాయంత్రం ఇంటికి రాగానే తన గదిలోకి వెళ్ళి మంచం మీదపడి భోరున ఏడ్చింది తల్లి ఎంత బతిమిలాడినా విషయమేమిటో చెప్పలేదు. చీకటి పడుతుండగా చంద్రమోహన్ ఇల్లు చేరుకున్నాడు. "బాబూ! వాహినీ ఎందుకో దిగులు పడుతుంది. ఎంత అడిగినా చెప్పడంలేదు కాలేజీలో ఏదన్నా గొడవ జరిగిందేమో- నీవైన అడిగి తెల్సుకో నాయనా-" అని అన్నది దుర్గాబాయి

"అలాగా?" వాహిని గదిలోకి వెళ్ళాడు చంద్రమోహన్.

వాహిని దిండు మీద తలఆన్చి కిటికీలోంచి ఎక్కడో చూస్తూ పడుకుంది.

ఆ భంగిమ ఎందుకో చంద్రమోహన్ గుండెల్ని కలచి వేసింది దగ్గరగా వెళ్ళాడు.

"ఏమిటి వాహిని! ఏం జరిగింది ఏడుస్తున్నావట ఎందుకు?" ఆప్యాయంగా తలనిమిరాడు.

వాసీంని లేచి కూర్చుని బలవంతాన నవ్వింది.

"అమ్మ చెప్పిందా? ఏమీ లేదు కాలేజీలో ఏదో చిన్న గొడవ మనసేమీ బాగా లేదు."

"ఏమిటా గొడవ?"

"గేమ్స్ దగ్గర ఏదో పేచీలే- అన్నట్లు రాత్రికో కథ చెప్పాలి. నీకో కథ చెప్పాలి. నీ కథ విని చాలా రోజులయింది" నవ్వుతూ అన్నది. చంద్రమోహన్ నవ్వలేదు ఏడ్చి ఉబ్బిన ఆమె ముఖాన్ని కండ్లను చూసాడు. "వాసీంని" మామూలుగా ఐతే యేడవదు. యేదో గొడవ జరిగింది తన మనస్సుకు కష్టం కలిగింది తనతో చెప్పడం లేదు మొత్తానికి పెద్ద గొడవవే జరిగి వుంటుంది. యేమిటిది? అని ఆలోచించాడు.

అన్నయ్య తన విషయాన్ని ఎక్కడ పసిగడతాడని మాట మార్చేస్తూ ఆ విషయాన్ని తప్పించాలని చూసింది కానీ చంద్రమోహన్ వినలేదు. ఆ విషయాన్నే యేం జరిగిందోనని ప్రశ్నించాడు.

"యేమిటన్నయ్యా! అమ్మకంటే చావనస్తం. ఇప్పుడేమయింది బాగానే వున్నాను."

"వాసీంనీ! నీ బాధను పంచుకునేందుకు నీకో అన్నయ్య వున్నాడనే మర్చిపోకు. నీకు అండగా నేను వున్నాను మన

సులో మథనపడేకన్నా ఆత్మీయులతో పంచుకుంటే ఊరట కలుగుతుంది.

"అలాగే అవసరం కలిగినప్పుడు నీ సహాయాన్ని తప్పక స్వీకరిస్తాను పద భోజనం చేద్దాం" అని లేచింది. అతను నెమ్మదిగా లేచి కదిలాడు.

ఆ తరువాత వాహిని ఈ విధంగా ఆలోచించుకుంది.

"ఇంత చిన్న విషయానికి నేనెందుకిలా అమ్మా, అన్నయ్యాల వద్ద బయటపడిపోయాను. కృష్ణప్రేమను పొందాలంటే ఎన్నో అవమానాలు—అడ్డంకులు ఎదురవుతూనే వుంటాయి. వాటన్నిటినీ ఓర్పుతో- చిరునవ్వుతో జయించాలి. తప్పదు. ప్రేమించిన వాళ్ళకు ఇక్కట్లుతప్పవు. ఇన్ని అడ్డంకుల్నీ, అవమానాల్ని జయించి ముందుకుపోవడమే నిజమైన ప్రేమ లక్షణం- కృష్ణను చేరుకునేందుకు తను దేనికైనా సిద్ధమే-" అని నిశ్చయించుకుంది.

# 14

"చెప్పు ఎంత కావాలో?"

"నీవే చెప్పు ఎంత ఇవ్వగలవో?"

హేమాదేవి కొన్ని క్షణాలు యోచించి, బ్యాగు లోంచి క్యాష్ తీసి టేబుల్ మీద పెట్టి-" ప్రస్తుతానికి ఈ ఐదు వేలూ తీసుకో. పని సవ్యంగా జరిగిన తరువాత మిగతా పదివేలూ ఇస్తాను-" అని అన్నది.

"అంటే మొత్తం పదిహేను వేలేనా?"

"ఏం చాలదా?"

"ఆస్తి చేజిక్కుతుండగా ఆశకు అంతెక్కడలే కానీ. నీకు నాలుగైదు లక్షల రూపాయల విలువగల ఆస్థి, నాకుముష్టి పదిహేను వేలా? ఇదీమరీ దారుణం!" నవ్వాడతను.

"మరో పదివేలు కావాలంటే తీసుకోరాదూ. దేనికీ గొడవ" కొంచం చిరాకుపడింది హేమాదేవి.

"ఇప్పుడు నచ్చావ్. పని ముఖ్యంగానీ, డబ్బు కాదు-"

"అదే నేనూ అనేది. ఎవరికీ అనుమానం కలగకుండా జాగ్రత్తగా వ్యవహరించాలి, తెల్సిందా?"

"ఆ విషయం అంతగా చెప్పాల్సిన పని లేదు. నీవే చూస్తావు నా తడాఖా-" మీసం మెలి త్రిప్పాడతను.

అబ్బురంగా చూసింది అతనివంక హేమాదేవి.

"మొత్తానికి ఘటికుడివే-"

"నీవు మాత్రం తక్కువదానివా?"

నవ్వుకున్నారిద్దరూ. "ఆఁ... నేను చెప్పిన విషయాలన్నీ గుర్తున్నాయిగా?"

"గుర్తున్నట్లే-"

"నట్లే ఏమిటి?" మళ్ళీ చెబుతాను విను-"అని గొంతు సవరించుకున్నది హేమాదేవి.

"సుజాతకు నీకు పెళ్ళి జరుగుతుంది-"

"అని నీ వంటున్నావు-"

"మంచిగా దాన్ని లోబరుచుకోవాలి-"

"ప్రయత్నిస్తాను."

"ఆ తరువాత నెమ్మదిగా ఆస్తి రాయించుకోవాలి-"

"ఒకవేళ రాయకపోతే?"

"ఏమిటా ప్రశ్న. రాసేలా చేయాలి. ఇంత చేసేది దేనికి?"

"సరే-అలాగే చేస్తాను. ఆ తరువాత" నవ్వాడతను.

"అనుకున్న ప్రకారం ఇద్దరంకలసి బాంబేచెక్కేద్దాం" నవ్వుతూ సుతారంగా అతని చెంపల్ని మీటింది హేమా దేవి ఆమె చేతినలాగే పట్టుకుని ముద్దుపెట్టుకున్నాడు.

"ఛీ...ఏమిటిది? వదులు" ఎరుగవల్లె వగలు పోయింది.

"ఏం బెట్టుచేస్తున్నావా?"

"నుకీ పట్టకగలా ఏమిటది" చిరు సిగ్గులతో మెలికలు తిరిగిపోయింది.

అతను నవ్వేస్తూ ఆమె చేతిని వదిలేసాడు.

# 15

"వాహినీ! ఓ వాహినీ. ఏయ్. నిలబడు ఒక్కమాట-" వెనకనుంచి కృష్ణపిలుస్తున్నా ఆగకుండా చరచరా అడుగులు

చేస్తూ దగ్గరలోవున్న పోస్టాఫీసు వరండాలోకి వెళ్ళి నిల బడింది.

ఆయాసంతో వగరుస్తూ వచ్చాడు కృష్ణ.

"పిలుస్తుంటే ఎందుకలా పలక్కుండావచ్చేశావు-" నిష్ఠూరంగా అన్నాడు.

"కృష్ణా! నేనో మాట చెబుతాను అర్థం చేసు కుంటావా?"

"ఏమిటి వాహినీ?" అనుమానంగా చూసాడు ఆమె ముఖంలోకి.

"ఏం లేదు ఇక మనం కాలేజీ ఆవరణలో వున్నంత సేపూ మాట్లాడుకోవద్దు!"

"ఏం ఎందుకని?" నొసలు చిట్లించాడు కృష్ణ.

"ఏం లేదు. మనల్ని గురించి నల్గురూ నాల్గురకాలుగా అనుకుంటున్నారు అందుకని."

"అనుకోనీ మనకేమిటి? మనం ప్రేమించుకుంటున్నాం పెళ్ళిచేసుకుంటాం_" గలగలమని నవ్వాడు కృష్ణ. వాహినీ నవ్వలేకపోయింది. విషయాన్ని ఎలా అతనికి చెప్పాలోబోధ పళ్ళేదు.

"కాస్త నవ్వుకట్టిపెట్టి. నేను చెప్పే విషయాన్ని సీరి యస్‌గా తీసుకో" మందలిస్తున్నట్లు అన్నది వాహిని.

"ఇంతకూ ఏం చేద్దామంటావ్?"

"చేసేదానికి ఏమీలేదు. కాలేజీలో నన్ను పలక రించకు."

గంభీరంగా మారిపోయిందతని వదనం.

"ఒకరనుకుంటున్నారని బాధలేదుగానీ, వాళ్ళలా అను కునేందుకు అవకాశం ఇవ్వడం మన దే తప్పు. అందుకే మనం మాట్లాడుకోవాలంటే చాలా ప్రదేశాలున్నాయి. దయచేసి కాలేజీలో మాత్రం నావేపు కన్నెత్తయినా చూడకు."

"అలాగే నిన్ను చూస్తూనే కళ్ళుమూసుకుని నడిచి పోతాను."

"కోపం వచ్చిందా?"

"దేనికి కోపం?"

"మన మంచికే అలా చెబుతున్నాను గానీ, నీవంటే ప్రేమలేక కాదు-" అతని చేయినొక్క- వదిలింది. అతను నవ్వాడు మనోహరంగా, "నీ మనసు నాకు తెలుసువాహినీ. ఆ రోజు మా ఇంటికి వచ్చికూడా నాతో చెప్పలేదు, నేను బాధపడతాననేగా దాచేసావు?"

"అవన్నీ ఇప్పుడెందుకు. జరిగినదాన్ని మరిచిపో. నేను వెళుతున్నా నా కోసం అమ్మ ఎదురుచూస్తుంది."

"సాయంత్రం పిక్చర్ కెల్దామా? చాలా రోజులయింది కదూ మనం వెళ్ళి—"

"వీలైతే వస్తాను. ముందే మాటివ్వలేను."

"ఊహూఁ—రావాల్సిందే" గారాంగా అన్నాడు ఆమె నవ్వుతూ ముసిపెడగా.

"సరే, అలాగే ఐదున్నరకల్లా పార్కు దగ్గర వుండు వస్తాను-" అని వెళ్ళిపోయింది ఆమె.

కృష్ణ హుషారుగా ఈలవేస్తూ, సన్నగా కూనిరాగం తీస్తూ కదిలిపోయాడు.

* * *

'ఉదయంనుంచి ఎక్కడకెళ్ళారు? ఇప్పుడా రావడం?' అని నిష్టూరమాడింది సుజాత.

చంద్రమోహన్ నవ్వుతూ ఆమె కెదురుగా కూర్చున్నాడు.

"మీ అత్తయ్య లేదుగా?"

"లేదులే—" అని నవ్వింది చిన్నగా.

"రక్షించింది మహాతల్లి..." తనూ నవ్వాడు.

"ఆమెను చూస్తే మాకూ భయమేసట్టుందే-"

"భయమా! నా కెందుకు. కాకుంటే ఆమె నోరుకాస్త దురుసు అంతే..."

మరి కాస్సేపు ఏవో కబుర్లు దొర్లాయి వారి మధ్యన

"నేను చెప్పిన విషయం ఏమాలోచించారు?" అడిగింది సుజాత.

"నాకేమీ అభ్యంతరంలేదు ఎటూ నిరుద్యోగినే. ఏదో ఒక పని కావాలి నాకు. జీతం ఇస్తానంటున్నారు. ఇంక అభ్యంతరం ఎందుకుంటుంది? అని నవ్వాడు పలచగా.



"అయితే ఆలస్యమెందుకు రేపటినుంచీ కార్యరంగంలోకి దిగండి-"

"చెప్పండి ఏమేమి చేయాలో—"

"ముందుగా తోటను శుభ్రం చేయాలి. ఎత్తు పల్లాలు లేకుండా చదును చేయించాలి ఆ తరువాత ఎవరన్నా మంచి కాంట్రాక్టర్‌తో కలిసి మాట్లాడి ప్లానింగు వేయాలి."

"అంటే ఎన్ని బిల్డింగ్‌లు కట్టించాలని మీ ఉద్దేశ్యం?"

"అవన్నీ నాకేం తెలుస్తాయి. మీరే చూసుకోవాలి. ఇందులో మీకు పూర్తి స్వాతంత్ర్యం ఇస్తున్నాను. నా వల్లా ఎంత డబ్బు కావాలో చెబితే ఇవ్వడమే-" అనిఅన్నదిసుజాత కొన్ని క్షణాలు మౌనం చిందులేసింది.



"అయితే రేపోసారి తోటకువెళ్ళి చూసి వద్దామా?" అని అడిగాడు చంద్రమోహన్.

"వెళ్ళిరండి..."

"మీరు కూడా రండి, ఎక్కడెక్కడ ఏమేమిచేయాలో ఆలోచించవచ్చు."

"నేనా" భారంగా నిట్టూర్చింది.

"మరేం పర్వాలేదు. కారులో వెళ్ళి కారులో రావచ్చు వెంట సీతమ్మను కూడా తీసికెళ్దాం—"ఆమె తన అశక్తతకు బాధపడుతుందని అలా అన్నాడు.

ఆమె మాట్లాడలేదు? అతన్నే చూస్తుంది నిశితంగా. ఆ చూపుల్ని తప్పించుకుంటూ దృష్టిని మరో వేపుకు సాగించాడు చంద్రమోహన్.

మరికొంచం సేపు మాట్లాడి శెలవు తీసుకుని బయటపడ్డాడు చంద్రమోహన్.

'ఈ' ఇంటికీ తనకూ ఏదో అవినాభావ సంబంధమున్నది లేకుంటే హేమాదేవి రావద్దని చెప్పినా తను వస్తున్నాడు. ఆమె కాదన్నా సుజాత తనకు పని కల్పిస్తుంది. ఇద్దరికీ ఎంత వ్యత్యాసముంది!" అని అనుకుంటూ నడుస్తున్నాడు.. ఇంతలో "ఒరేయ్ చంద్రా!" అన్న పిలుపువిని ఆగిపోయాడు.

ఒకప్పుడు తన క్లాస్‌మేట్ మురళి-చేయి ఊపుతూ పిలుస్తున్నాడు రోడ్డు కవతల పేవ్‌మెంటు మీద నిలబడి. అతన్ని చూస్తూనే చంద్రమోహన్ ముఖం విప్పారింది. అప్రయత్నంగా తన కాళ్ళు ఆ వేపుకి లాక్కుపోయాయి

"ఎన్నాళ్ళకురా నిన్ను చూడ్డం!" అంటూ ఆప్యాయంగా కరచాలనం చేసాడు.

"అదిసరే, నీవేమిటి ఇక్కడ తిరుగుతున్నావు? ఏదన్నా ఉద్యోగమా?" నవ్వుతూ పలకరించాడు మురళి.

"అలాంటిదేమీ లేదు. ఆ ప్రయత్నంలోనే వున్నాను-" నవ్వలేక నవ్వాడు చంద్రమోహన్.

"పద నా రూం కెళ్దాం. సరదాగా కాస్సేపు కబుర్లు చెప్పుకుందాం—"

"రూమ్ కూడా తీసుకున్నావా? ఎన్నాళ్ళయింది ఊరు వచ్చి?"

"రెండు రోజులయింది. అవన్నీ తరువాత-నడువు రూం దగ్గరికి-" చేయిపట్టుకుని నడుస్తూ మురళీ రూం చేరుకున్నారు.

"ఇదేగా నా మందిరం ఎలావుంది?"

"బ్రహ్మాండంగా వుంది. అద్దె రెండు వందలు దాకా వుండి ఉంటుంది కదూ?" ఇంటినిబట్టి అంచనా వేస్తూ అన్నాడు చంద్రమోహన్.

"ఆఁ—అంతేలే-ఏమిటి విశేషాలు చెప్పు. కూర్చో, నిలబడే వున్నావు?" మురళి ప్యాంటు విప్పి లుంగీ కట్టుకుని మంచంమీద కూలబడ్డాడు చంద్రమోహన్ కూడా కూర్చున్నాడు ప్రక్కన.

"ఉద్యోగ ప్రయత్నం కోసం వచ్చావా?" అడిగాడు చంద్రమోహన్.

"దానికోసమే బయలు దేరాను. అనుకోకుండా మరో ఛాన్సు తగిలింది..."

"ఛాన్సా? ఏమిటది?"

ప్రస్తుతం ఓ నాటకంలో వేషం వేస్తున్నాను..." చెప్పాడు మురళి

"నాటకమా? ఏమిట్రా నీ గొడవ. సరిగ్గా చెప్పు..." విస్తుపోతున్నాడు చంద్రమోహన్ అతని మాటలకు.

"అందరూ జీవితాలను నాటకాలుగా ప్రవర్తిస్తే— నేను జీవితం కోసం-జీతం కోసం నటన చేస్తున్నాను—"

"అంటే—వివరంగా చెప్పు"

"ఈ ఊర్లో హేమాదేవని ఒకామె వుంది. పేరు వినే వుంటావనుకుంటాను. పెద్ద పలుకుబడిగల మనిషిలే—" మురళి నోటవెంట 'హేమాదేవి' పేరు వింటూనే ఆశ్చర్యంతో నోరు తెరుచుకుని వుండిపోయాడు చంద్రమోహన్.

"ఏమిట్రా అలా తెల్లబోయి చూస్తావు? ఆమె నీకు తెలుసా?"

"నాకా? ఉహుం... తెలియదు. పేరు విన్నట్లుంది. ఆవిడతో నీకేమిటి పని?" అనుమానంగా ప్రశ్నించాడు చంద్రమోహన్.

"ఆమె ఓ నాటకం ఆడమన్నది. అప్పుడే ఐదువేలు అడ్వాన్సుగా కూడా ఇచ్చింది. నాటకం రక్తి కడితే మరో ఇరవై వేలుదాకా ఇస్తానన్నది. మాట మీద నిలబడే మనిషి లాగానే వుంది-"

"ఏం చెప్పిందేమిటి?"

"ఆమెకో అవిటి మేనకోడలుందట ఆమెను నేను పెళ్ళి చేసుకోవాలట. ఆ తరువాత ఆ స్తి చే జిక్కించుకుని తన పేరున రాయించాలట. ఇదీ నాటకం—" అని పగలబడి నవ్వాడు మురళి.

చంద్రమోహన్ ముఖం రక్తం లేనట్టు తెల్లగా పాలి పోయింది.

గుండెచాలా తీవ్రంగా కొట్టుకుంటుంది.

"ఏమిటివీడు అంటున్నది సుజాతను వీడు పెళ్లి చేసుకోవాలా? ఆస్తికోసం హేమాదేవి ఎంతకు తెగించింది. వీడు —వీడెలా అంగీకరించాడు అందుకు?" మురళిమీద కోపం కల్గింది చంద్రమోహన్‌కు.

"నీ వేమన్నావు?"

"ఏమనే దేముంది? నాటకంగా ఒప్పేసుకున్నాను డబ్బులొస్తున్నప్పుడు చేదా?"

"ఓ రేయ్ ఎందుకిలా దుర్మార్గంగా మారిపోయావ్? డబ్బుకోసం గడ్డితింటావా. ఇలాంటి బ్రతుకు బ్రతక్కపోతే నీళ్ళు లేని బావి చూసుకుని చావరాదు.ఛీ...ఛీ"అసహ్యంగా చీదరించుకున్నాడు చంద్రమోహన్.

"ఏమిట్రోయ్ నీతులు వల్లిస్తున్నావు. ఈ రోజుల్లో గడ్డితిన్నా డబ్బులు ఇచ్చే నాధుడు లేడు. అనుకోకుండావచ్చిన

అవకాశాన్ని సద్వినియోగపరుచుకోవడం ఉత్తమునిలక్షణ! అయినా నీకెందుకురా అంత బాధ."

"తల్లిదండ్రులను పోగొట్టుకుని, దిక్కూ మొక్కూ లేని ఓ అభాగ్యురాల్నిరా నీవు మోసంచేయబోయేది. ఇదిధర్మమేమో ఆలోచించు. వద్దు. ఆ డబ్బు లేకపోతే పోయింది. దయచేసి అలాంటి పనులకు పూనుకోవద్దు. నా మాటవిను." ప్రతిమాలుతున్నట్లు అన్నాడు చంద్రమోహన్.

"ఎలా బ్రదర్! డబ్బు లేకపోతే జీవితందుర్లభమే! అయినా ఆమెను నేను ఏమి చేయడంలేదే—ఊరికే పెళ్లిచేసుకుని, హేమాదేవి పరిముగించి, నా దారిన నేను వచ్చేస్తాను."

"చేసుకుంటావురా పెళ్ళి. ఎందుకు చేసుకోవూ! నీలాంటి లుచ్చాలుండబట్టే హేమాదేవి ఆటలు అలా సాగుతున్నాయి. చూస్తాను, మీనాటకమెలా గట్టెక్కుతుందో." ఆవేశంతో చివ్వున లేచి వెళ్లిపోయాడు చంద్రమోహన్. మురళీ వెనకనుంచి పిలుస్తున్నా వినిపించుకోలేదు.

# 16

"పెళ్ళి ఖాయం చేసాను సుజా!"

"ఎవరికత్తయ్యా...? దిగ్భ్రమ చెందింది సుజాత ఆ మాటకు.

"ఇంకెవరికే పిచ్చిపిల్లా, నీకే" ఆప్యాయత వొలక బోసింది హేమాదేవి.

సుజాతకు కొన్ని క్షణాలు నోటమాట రాలేదు.

"నాకు పెళ్ళా! నీకుగాని మతిపోయిందా!"

"ఎందుకంత తెల్లబోతావు. ఇందులో విడ్డూర మేముందే? కాస్త కాలు వంకర వున్నంతమాత్రాన నీకు పెళ్ళిగాకుండా పోతుందా ఏమిటి? లోకం గొడ్డుపోలేదు. లక్షణమైన సంబంధం మాట్లాడిపెట్టాను. నీ చెవినవేసి ఆ మూాడు ముళ్ళూ వేయిస్తే నా బరువు తీరిపోతుంది."

"అలాంటి పిచ్చిపిచ్చి ఆలోచనలు పెట్టుకోకు. ఎవరన్నా వింటే నవ్విపోతారు."

"ఎవరూ నవ్వేది ఆడపుటక పుట్టినాక పెళ్ళిచేసుకోవడం తప్పా."

"దయచేసి ఆ విషయం మర్చిపో. ఈజన్మకలాంటిఆలోచన లేదునాకు" అసహనంగా అన్నది సుజాత.

"అలా అంటే ఎలాగమ్మా! అవతల వాళ్ళకు మాటిచ్చాను నామాటవిను తల్లీ. పెళ్ళిచేసుకుంటే సుఖపడతావు అబ్బాయి మంచి గుణవంతుడు."

"చెబుతుంటే అర్థంచేసుకోవేనాకలాంటికోరికలు లేవు. ఖచ్చితంగా చెప్పేసింది సుజాత.

"మరి నా మాటేంగాను-"కోపంగా చూసింది హేమాదేవి.

"నీ మాటకోసం నా బ్రతుకునుబలిచేసుకోమంటావా" తీవ్రంగానే అన్నది సుజాత.

"లక్షణంగా పెళ్ళిచేసుకునికాపురంచేయమంటున్నాను గాని-నిన్నేమన్నా తప్పుడుపనులుచేయమంటున్నానా! దేనికో మొండిపట్టుదల-ఏమయిపోదామనుకుంటున్నావు."

"ఏమైనా ఇంతకన్నా ఏమీకాదు నన్నిలా బ్రతకనీ."

"వీల్లేదు ఈ పెళ్ళి జరిగితీరుతుంది. నీకిష్టంలేకపోయినా సరే కాళ్ళూ చేతులూకట్టి పెళ్ళి జరిపిస్తాను ఏమనుకున్నావో. అమ్మా,తల్లి అంటే నీవెందుకు వింటావు" అనిహుంకరించింది.

"అత్తయ్యా దేనికి నామీదనికింతకక్ష. నాకు పెళ్ళి చేసుకోవడంఇష్టంలేదంటే వినవే"

"పెళ్ళిచేసుకోక ఏం చేస్తావే. ఆ గాడిదకొడుకు చంద్రాతో కులుకుదామనుకున్నావా. ఇకనుంచీ నీ ఆటలు సాగవు చెప్పినట్టు పడివుండు."

"ఛీ! ఎందుకంత నిచంగానిందిస్తావు. ఆయన దేవుడు" ఆ పేరుఉచ్చరించడానికి కూడా తగవు. మరోమాట అంటే సహించేది లేదు "

సహించలేకపోతే ఉరేసుకుచావు. పీడా వదులుతుంది జెష్టముండ యెక్కడదాపురించావో నాప్రాణానికి, కారు మంటలా చుట్టుకుపోయావు" అని చెడామడా తిట్టిపోసింది హేమాదేవి

సుజాత పెదవికదపలేదు. మవునంగా వాటిని భరిస్తూంది.

"యేమిటండీమీరు మరీనూ! మీఅత్తయ్య పెళ్ళి చేస్తానంటే వద్దంటారే, ఒప్పేసుకోండి-"అంతవరకూ వాళ్ళ సంభాషణవిన్న చంద్రమోహన్ ఇవతలకి వస్తూ అన్నాడు చిన్నగా నవ్వుతూ.

సుజాత అతన్ని ఆశ్చర్యంగా చూసిందేగాని, పెదవి కదపలేదు

హేమాదేవి మండిపడింది అతన్ని చూస్తూనే.

"నీ సలహాలు ఉపదేశాలు ఎవరికీఅక్కర్లేదు.అయినా మళ్ళీయెందుకొచ్చావు?ఒక్కసారి చెప్పితేసిగ్గు లేదూ ఏం పంఖంపెట్టుకొనివచ్చావు"గయ్యమంది.

చంద్రమోహన్ ఆమె మాటల్ని పట్టించుకోకుండా తిరిగి యిలా అన్నాడు!

"పెళ్ళికొడుకు దేవ్వూరండీ, బావుంటాడా."

"యే ఊరయితే నీ కెందుకు. ఇవి మాస్వవిషయాలు నీజోక్యం అనవసరం" విదిల్చేసింది అయినా చంద్రమోహన్ ఊరుకోలేదు.

యెందుకండీ అంత కోపం, ఇప్పుడు నేనేం తప్పుగా మాట్లాడాను పెళ్ళి కొడుకు బావుంటాడా అని అడిగాను అంతేగా, ఇష్టం లేకపోతే చెప్పడం మానేయండి."

"నీ కంటే వెయ్యి రెట్లు బావుంటాడు సరేనా"అక్కసుగా అంది హేమాదేవి.

నా కంటే అందగాడా, యెవడువాడు మురళియేనా" పకపకా నవ్వేశాడు.

మురళీ పేరు వినగానే పక్కలో బాంబుపడినట్లు అదిరి పోయింది హేమాదేవి.

క్రీగంట ఆమెను గమనిస్తూనే సుజాత వేపు తిరిగి "సుజాతగారూ మీ అత్తయ్యకు మీ మీద ప్రేమ అమో

ఘం యెంత చక్కని సంబంధం చూసిందనుకున్నారు? పెళ్ళి కొడుకు మురళీ నాకు బాగా తెలుసు చాలా మంచివాడు వప్పుకోండి ఈ పెళ్ళికి" అన్నాడు.

"నీకు మురళి తెలుసా...!" ముఖం పాలిపోతుండగా అడిగింది హేమాదేవి.

"ఓ బాగా తెలుసు తెలియనివల్లామీకే" కటినంగా అన్నాడు.

హేమాదేవి బెదిరిపోయింది విషయం ఎక్కడ బయట పడిపోతుందో అని.

"అయితే ఇప్పుడేమంటావ్" బింకంగా అన్నది హేమాదేవి.

"యేమన్నా అనడానికి నాకేం పని. మురళీగారు వూరు వదిలి వెళ్ళిపోయాడని చెబుతున్నాను మీ ఇష్టం"

మురళీ వూరు వదిలి వెళ్ళిపోయాడా?" గొంతుతడారి పోతోంది హేమదేవికి.

"లేదు నేన్నాతన్ని తగిలేశాను" అతని కంఠంలోని తీవ్రతకు చలించిపోయింది ఆమె. సన్నగా చిరు చెమటలు పట్టాయి. ఇక అక్కడ వుండడం శ్రేయస్కరంకాదని- ఏదో పని వున్నదానిలా "సరేలే-నీపనేదో చూసుకుని వెళ్లు" అనేసి చకచకా మెట్లుదిగి వెళ్ళిపోయింది.

అంతవరకూ వింతబొమ్మలా కూర్చుని అర్థం కాని మాటల్ని వింటున్న సుజాత తేరుకుంది. అతనుమురళీని తన్ని తగలేశాననడం- అత్తయ్య కంగారు పడడం, ఆమె కంతా అయోమయంగానూ ఆశ్చర్యముగానూ వుంది.

చంద్రమోహన్ ఆమె కెదురుగా కూర్చున్నాడు. అతనిముఖంగంభీరంగామారిపోయింది. ఆమెఅతన్నే చూస్తోంది అతను పెదవి విప్పాడు. ఇంతలో హేమాదేవి వేగంగా వచ్చింది అక్కడికి. "నీతో మాట్లాడాలి. అలా వస్తావా?" **అని అన్నది అతన్ని ఉద్దేశించి.**

చంద్రమోహన్ ఆమె వంకచూసి మౌనంగా లేచాడు క్రిందకారులో కూర్చుని తలపైకెత్తి చూసాడు. అయోమయంగా తమనే చూస్తున్న సుజాత కనిపించింది. "మళ్ళీ ఇప్పుడే వస్తానన్నట్లు సైగ చేసాడు. సుజాత తలూపింది. కారు కదిలింది. కొన్ని క్షణాలు ఎవరూ మాట్లాలేదు. ఎందుకు ఆమె తనను కారులో తీసుకు వెళుతుందోనని ఆలోచిస్తున్నాడు చంద్రమొహన్.

"ఎందుకిలా నామీద కక్ష సాధిస్తున్నావ్? హేమాదేవి ప్రశ్నతో అతని ఆలోచనలు తెగాయి.

"కక్షా! నాకెందుకుంటుంది!" చిన్నగా నవ్వాడు.

"మరి నీ ఉద్దేశ్యమేమిటి? నా దారికి అడ్డు తగులుతున్నావ్"

'ఆదేం లేదు. మీరలా భ్రమపడుతున్నారు'

'మురళి నిజంగా వెళ్ళిపోయాడా?'

"వెళ్లిపోయాడు"

"ఏం చెప్పాడతను నీకు"

"అంతా చెప్పాడు దేనికి ఆరాలు!" ఎదురు ప్రశ్న వేశాడు చంద్రమోహను.

"నీకు డబ్బు కావాలా!"

"డబ్బా! దేనికి-మీరిస్తారా!"

"అవును ఎంత కావాలో చెప్పు ఇస్తాను. ఈ విషయం సుజాతతో అనకూడదు"

అప్పటికి బోధపడింది హేమా దేవి ఆంతర్యం. "అంటే డబ్బు ఎరజూపి నోరు నొక్కేయాలని చూస్తున్నారన్న మాట అవునా-"

"అయినా యివన్నీ నీకెందుకు చెప్పు! మా గొడవ లేమిటో మేము పడతాం. ఎంత కావాలో తీసుకుని దూరంగా వెళ్ళిపో-"

చంద్రమోహన్ నవ్వాడు తమాషాగా.

"మీరు చాలా తెలివిమంతులు."

"ధైర్యస్తురాల్ని గూడా. మర్యాదగా చెప్పినట్టు చేయకపోతే ఫలితం భయంకరంగావుంటుంది."

"ఏం బెదిరిస్తున్నారా."

"గొడవ లేకుండా సమస్యను పరిష్కరించుకుందా మంటున్నాను."

"నాకే సమస్యలూ లేవు. కారునిలపండి నేను వెళ్ళాలి"

"అయితే నా మాటవినవా?" తీక్షణంగా చూసింది హేమాదేవి.

"చూడండి డబ్బుకోసం గడ్డికరిచే అలవాటు నాకు లేదు. మీలా ఆత్మవంచనచేసుకుని నీచమైన బ్రతుకు నేను బ్రతకలేను. నాకు పనుంది కారుఆపు-"

"ఆఖరిసారి చెబుతున్నాను బాగా ఆలోచించుకో. నాతో వైరం పెంచుకోవడం మంచిదికాదు—"

"మీ బెదిరింపులకులొంగే ఘటాన్నికాదు. అయినా మీకెందుకీ పాడుబుద్ధి. సుజాత నీకు పరాయి పిల్లకాదు కదా! ఎందుకామెను అలా హింసిస్తున్నారు. వెధవ డబ్బు కోసం ఆమె జీవితాన్ని నరకం చేయాలని జూస్తావా! ఎందు కింత ధన వ్యామోహం?

"చాలించు నీ నీతులు, ఇంతవరకూమంచిగా చెప్పాను. వినకపోతే నీకర్మ.

"ఓస్ అలాగే కానీయి నీ చేతనయింది చేసుకో."

"సుజాతతో చెబుతా నంటావా?" పళ్ళు కొరికింది కసిగా.

"తప్పకుండా నీ నీచపు టాలోచనలు బయటపెట్టి జాగ్రత్తగా ఉండమని చెబుతాను..."

"రాస్కెల్! ఎంత పొగరు నీకు" విసురుగా చేయి ఎత్తింది. చటుక్కున ఆ చేయిని పట్టుకుని మెల్లిగ తిప్పుతూ

హేమా దేవి! నా సత్తా నీకు తెలీదు. పిచ్చి పిచ్చి వేషాలేస్తే ఎముకలు విరగ్గొడతాను." అని విసురుగా డోరు తెరుచుకుని వెళ్ళిపోయాడు చంద్రమోహన్.

హేమా దేవిముఖం మ్లానయింది. అవమానభారంతో గుండె దహించుకుపోతుంది. కసి, క్రోధం బుస్సునపొంగాయి 'ఇడియట్! ఎంతపొగరు ఈ హేమా దేవినే తూలనాడి పోతావా ఏకులా వచ్చి మేకులా కూర్చున్నాడు. చూపిస్తాను నా తడాఖా ' పై పెదవి కొరుక్కుంటూ విసురుగా కారుస్టార్ట్ చేసింది.

చంద్రమోహన్ నేరుగా సుజాత దగ్గరకు వచ్చాడు.

"ఎందుకు అత్తయ్య పిలిచింది."ఆత్రుతగా అడిగింది సుజాత.

"ఏమీ లేదు నాకు డబ్బు ఇవ్వాలని పిలిచింది." అని నవ్వాడు చంద్రమోహన్.

"డబ్బా! దేనికి?."విస్తుబోయింది.

"తన రహస్యాన్ని కాపాడటం కోసం ఎంత డబ్బు కావాలో తీసుకోమంది.-"

"ఏంచేశారు."

"బాగా బుద్ధి చెప్పి వచ్చాను. బెదిరించింది వెధవబెదిరింపు నా సత్తా తెలిసి నట్లులేదు. అందరూ తన లాగానే డబ్బుకోసం ఎంత నీచానికైనా పాల్పడతారను కుంటుంది."

"దయచేసి ఏంజరిగిందో వివరంగా చెప్పండి. మురళి ఎవరు అతన్ని మీరెందుకు తన్ని తగలేశారు. అంత గందర గోళంగావుంది."

"చెబుతాను మీ అత్తయ్యా నీ ఆస్తి కాజేయాలని ప్లాను వేసింది. మురళి నా స్నేహితుడు వాడిద్వారా తెలిసింది వాళ్ళు ఆడబోయే నాటకం" అని అంతా వివరంగా చెప్పాడు.

సుజాత ముఖం పాలిపోయింది. కళ్ళలో నీళ్ళు తిరి గాయి.

"ఆమె అత్తయ్యకాదు. నాపాలిటి రాక్షసి,నాఅసహా యతను ఆధారంగా తీసుకుని ఇష్టమొచ్చినట్లు ప్రవర్తిస్తుంది." సుజాత కళ్ళు ధారావాహికంగా కారి పోతున్నాయి.

"ఊరుకోండి జరిగిన దానికి నేనూ బాధపడుతున్నాను ఆమెకు ధనదాహం పట్టుకుంది."

"డబ్బుకోసం యేమయినా చేస్తుంది. యెంతకైనా తెగి స్తుంది. యేఅర్ధరాత్రో నాపీక నలిమేసినా ఆశ్చర్యపోనక్క ర్లేదు." అతనుమౌనంగా వుండిపోయాడు.

"చంద్రంగారూ నాకోసం ఓపనిచేసిపెట్టగలరా?"

యేమిటో చెప్పండి."

ఓగుక్కెడు విషం తెచ్చివ్వండి. ఎందుకూ కొరగాని ఈ బ్రతుకును అంతం చేసుకుంటాను." వలవలా యేడుస్తూ

రెండు చేతుల్లో ముఖం దాచుకుంది. చంద్రమోహన్ ఉలిక్కిపడ్డాడు ఆమాటలకు.

"జీవితం జీవించడానికే, దాన్ని బలి చేసుకునే హక్కు మనకు లేదు, విధాత సృష్టించిన ఈ జన్మను ఆయనే కడతేర్చేదాకా ఇష్టమున్నా, లేకున్నా బ్రతకాల్సిందే"

"దేనికండీ? ఏం చూసుకుని బ్రతకాలి? నా లాంటి దురదృష్ట వంతురాలికి ఏముందని బ్రతకటం? క్షణ క్షణానికీ అధికమయ్యే ఈ రంపపుకోతను భరించే శక్తి నాలో సన్నగిల్లిపోయింది. నాకెవరూ లేరు. నేనెవరికీ పనికిరాని దాన్ని. నేనీలవిటి బ్రతుకు మోయలేను."

"ఆమె దుఃఖాన్ని ఎలా పోగొట్టాలో అర్థం కాలేదు చంద్రమోహన్‌కి. అనవసరంగా ఆ విషయాన్ని చెప్పి ఈమె మనస్సు నొప్పించానే, చెప్పకున్నా బావుండేది. చెప్పకపోతే తెలిసేదెలా? ఏమైనా ముందు ముందు సుజాత ప్రాణానికి ఎసరు పెట్టవచ్చు హేమాదేవి. ఆ రాక్షసి బారినుండి ఈమెనెలా రక్షించాలి. అని మథనపడసాగాడు.

"నేనో మాట చెబుతాను వింటారా!" సందేహంగా అడిగాడు.

"చెప్పండి మీరేం చెప్పినా వింటాను. నన్ను ఈ కూపం లోంచి తప్పించి పుణ్యం కట్టుకోండి. నేను ఇక్కడ వుండలేను. ఎక్కడికయినా తీసుకుపోండి."

"అదే నేనూ చెప్పాలనుకుంటున్నాను. మీ మనసు కుదుటబడేంత వరకూ మీకు అభ్యంతరం లేకపోతే మా ఇంట్లో వుండవచ్చు. కంటికి రెప్పలా చూసుకునే అమ్మా, చెల్లి వున్నారు"

"మీ వాళ్ళు ఏమనుకుంటారో?"

"వాళ్ళు చాలా మంచివాళ్ళు, అలాఅనుకునే వాళ్ళు కాదు. తోటలో పని పూర్తి కాగానే మకాం అక్కడకు మార్చేయవచ్చు?"

"మీ ఇష్టం. మీకన్నా నాకెవరూ ఆత్మీయులు లేరు. మా అత్తయ్యను నేను భరించలేను ఆమెతో కలసి జీవించలేను మీతోనే వచ్చేస్తాను"

"ధైర్యంగా వుండండి మీకు ఎలాంటి బాధ కలగకుండా చూసుకునేందుకు నేను వున్నాను మీ ప్రాణానికి నా ప్రాణం అడ్డువేస్తాను. అనవసరంగా మనసుకష్టపెట్టుకోకండి" అభయమిస్తున్నట్లు ఓదార్చాడు చంద్రమోహన్. నీకు నేను ఉన్నాను, ఆమాట తలుచుకుంటే సుజాతకు ఏవో వింత ఆలోచనలు కల్గుతున్నాయి తృప్తిగా ఆమె కళ్ళు మెరిసాయి.

చంద్రమోహన్ బయటకు వచ్చాక ఆలోచించాడు.

ఆమెను తన ఇంటికి తీసుకెళ్తానని అన్నాడు బాగానే వుంది తనకే టిఖానా లేదు ఏదో సుచితనాన వాళ్ళు నాకింత అన్నం పెడుతున్నారు ఇప్పుడు ఈమెను కూడా తీసుకెళ్ళి

అవసరం బాధ్యత నెత్తిన వేస్తే అమ్మా నాన్నలు ఏమను కుంటారు? ఏమీ అనుకోరు వాళ్ళు అలాంటివాళ్ళు కారు. కష్టాలలో వున్నవారిని ఆదుకోవడం, సాయం చేయడంవారికి సహజ గుణం. అయినా సుజాత ఆయాచితంగా తమ ఇంట్లో తినడానికి అంగీకరిస్తుందా?

ఏది ఏమైనా అమ్మానాన్నలకు చెప్పి సుజాతను ఇం టికి తీసువెళ్ళాలి. హేమాదేవి నుండితప్పించాలి. చూస్తాను ఏం చేస్తుందో! అని అనుకుని ఇంటి దారి పట్టాడు చంద్ర మోహన్.

# 17

చంద్రమోహన్ చెప్పిన సుజాత కథ విన్న రామ చంద్రయ్యా, దుర్గాబాయి జాలితో ద్రవించిపోయారు.

"అలాగా పాపం! దిక్కులేని పిల్లను ఎందుకలా వేధి పిస్తుంది, పాపం ఎవరికి చెప్పుకుంటుంది? అయినవాళ్ళే అలా చేస్తే. మరేం ఆలోచించక తక్షణమే ఆమెను తీసుకువచ్చేయ్ మనతోనే నాలుగు పచ్చడి మెతుకులు తింటుంది" అని అన్నది దుర్గాబాయి.

"మేము ఏమీ అనుకోము, మంచి పని చేస్తుంటే ఎవరు కాదంటారు? అలాగే తీసుకురా, మీ అమ్మకు కొంచెం కాలక్షేపంగా వుంటారు... ఇద్దరూ తోడుగా వుంటారు, మనం బయటకు వెళ్ళినప్పుడు—" అని రామచంద్రయ్యగారు అన్నాడు

చంద్రమోహన్ ముఖం విప్పారింది.

"మీ మనసులు వెన్న, అందుకే కష్టాలలో వున్న పిల్ల బాధను అర్థం చేసుకో గలిగారు. మీ వంటి పవిత్ర మూర్తుల పెంపకంలో పెరగడం నా జీవితం చారితార్థమయింది." భక్తి పూర్వకంగా నమస్కరించి కదిలాడు చంద్రమోహన్.

రామచంద్రయ్యగారు, దుర్గాబాయి, తృప్తిగానిట్టూర్చారు.

"మా అమ్మ నాన్నలు నిన్ను తీసుకు రమ్మన్నారు. మీ బట్టలు వస్తువులు సర్దివుంచండి సాయంత్రమే వెళ్ళిపోదాం—" అని చంద్రమోహన్ అనగా సుజాత పొంగిపోయింది.

"మీ సహాయానికి కృతజ్ఞురాల్ని" అని అన్నది అంత కన్నా మాటలు పెగల్లేదు ఆమెకు.

ఆ సాయంత్రమే సుజాతను టాక్సీలో ఇంటికి చేర్చాడు చంద్రమోహన్.

దుర్గాబాయి సుజాతను ప్రేమగా ఆహ్వానించింది. వాహినీని పరిచయం చేసాడు- ఆ యిల్లు వాతావరణం సుజాతకు బాగా నచ్చాయి ఆమె కోసం ప్రత్యేకంగా ఓ గది ఏర్పాటు చేసారు. కానీ సుజాత వద్దంది.

"నాకు ప్రత్యేకమైన గది అవసరం లేదు. వాహినీ నేనూ ఒకే గదిలో వుంటాం, తోడుగా వుంటుంది-" ఆమె మాటలకు అందరూ అదే మంచిదని- ఇక బలవంత పెట్ట లేదు.

రాత్రి భోజనాల దగ్గర దుర్గబాయి కొసరి కొసరి వడ్డించి తినిపించింది. సుజాత కళ్ళు చెమ్మగిల్లాయి. ఆ ప్రేమకు. నా జన్మలో ప్రేమగా కడుపునిండా అన్నం తినిపించినవారు మీా లేరమ్మా" అన్నది సుజాత.

దుర్గాబాయి పొంగిపోయింది. "పాపం! పిచ్చిపిల్ల. తల్లి దండ్రుల ప్రేమకు మొహం వాచిపోయింది" అనుకున్నది. వాహినీ గల గల మాట్లాడేస్తూ, సుజాతతో బాగా కలసి పోయింది. సుజాతకు వాహినీ అంటే మంచిఅభిమానం ఏర్ప డింది.

రోజులు గడుస్తున్నాయి. సుజాతకు ఇప్పుడు యెంతో ఆనందంగా, ఉల్లాసంగా వుంది.

ప్రేమగా చూసుకునే దుర్గాబాయి, ఆత్మీయతనుపంచే వాహినీ కబుర్లు, మంచి చెడుల్ని విచారిస్తూ అనుక్షణం తన

ఆనందానికి పాటుపడే చంద్రమోహన్ ఇద్దరి మధ్య ఆమె స్వర్గాన్నే చవిచూస్తుంది కలకాలం అక్కడే ఆ మనుషుల మధ్యే వుండిపోతే బావుండు అనుకుంది.

చంద్రమోహన్ తోటలో పని ప్రారంభించాడు. ఓ రోజు సుజాతను టాక్సీలో తీసికెళ్ళి అంతా చూపించుకు వచ్చాడు ఇద్దరూ తర్జనభర్జనలు జరిపారు. కాంట్రాక్టర్‌తో మాట్లాడి బిల్డింగ్ ప్లానింగ్ వేసారు. పనులు చకాచకా జరిగి పోతున్నాయి. అతడు దగ్గరుండి సవ్యంగా జరిపిస్తున్నాడు. అన్ని బాధత్యలు అతని మీద వదిలేసి నిశ్చింతగా వుండి పోయింది సుజాత వాళ్ళ ప్లాను ప్రకారం కనీసం పదిలక్షలకు పైగానే ఖర్చు అవుతుంది. ఎంత ఖర్చు అయినా సరేనని పట్టు బట్టింది సుజాత. ఎప్పటికప్పుడు డబ్బు అతనికి అందజేస్తుంది చెక్కు రూపేణా.

మొదట్లో సుజాత కనిపించక పోయేసరికి హేమాదేవి కంగారు పడిపోయింది. "ఎక్కడకెళ్ళిందీ కుంటిది? కొంపదీసి వాడితో గానీ లేచిపోయిందా ఏమిటి? పోతేపోయింది పెదవ ముండ బీరువా తాళాలు, బ్యాంక్ ఎకౌంట్ - డబ్బు అంతా దానిచేతిలో ఇరుక్కుపోయిందే-" అనివాపోయింది. తర్వాత వాకబుచేయగా చంద్రమోహన్ ఇంట్లోవున్నదని తెలుసుకుని వెంటనే కారు వేసుకుని వెళ్ళిది.

"ఏమిటి తల్లీ! నీవు కనిపించక పోతే ఏమయ్యావోనని హడలిపోయాను-" సుజాతను చూసి ముఖం ఇంత చేసుకుని అన్నది హేమాదేవి.

అయిష్టంగా ముఖం ప్రక్కకు త్రిప్పుకుంది సుజాత.

"మనింటికి పోదాం రా సుజా పరాయి వాళ్ళింట్లో ఎన్నాళ్ళని వుంటావు? లేపోదాం-" చేయి పట్టుకుని అన్నది. ఆ చేతిని విసురుగా నెట్టేసి- నేను రాను. నాకు ఇక్కడే బావుంది అన్నది దురుసుగా.

"రానంటే ఎలానే తల్లీ! ఎంతగాదన్నా నేను నీకు అత్తయ్యను కాకుండాపోతానా నీవు నాకోడలివి కాకుండా పోతావా? రక్తసంబంధాలు ఎక్కడికిపోతాయి. తెంచుకుందామన్నా తెగేవి కావు-"

"రక్తసంబంధం" పళ్ళు నూరింది సుజాత. "నీవు నాకు అత్తయ్యవా? కాదు నాకుపట్టిన మహామ్మారివి డబ్బుకోసం నా బ్రతుకులో నిప్పులు పోయాలని చూసిన రాక్షసివి నీముఖం చూడాలంటేనే అసహ్యంగా వుంది. పైగా రక్తసంబంధాలని మాట్లాడు తున్నావా? ఆ మాట అనడానికి సిగ్గు శేయడం లేదూ?" చీత్కారం చేసింది అసహ్యంగా.

"ఈ వెధవ చంద్రంగాడు దీనిమనసు విరిచేసి వుంటాడు. మహా మొండిదానిలా తయారయింది. ఏదో విధంగా మెడలు వొంచి తీసుకుపోవాలి అని అనుకున్నది హేమాదేవి.

"చెప్పుడు మాటలువిని పెద్దదాన్నని గౌరవం లేకుండా ఎలా తిట్టిపోస్తున్నావే. అనవమ్మా అను పడ్డవాళ్ళెప్పుడూ చెడ్డ వాళ్ళు కాదు. ఇంత పసిగుడ్డు అప్పటి నుంచి సాకిసంతరించి

వందుకు మంచ సత్కారమే చేస్తున్నావు—" అంటూ వగ లేడ్పులు ఏడ్చింది.

"ఏడవకు నీ ఏడ్పు చూస్తే మండిపోతుంది" ఉరిమింది సుజాత.

"అయితే ఇంటికి రానంటావు?" కోపంగా అన్నది హేమాదేవి.

"రాను, రాను. నా ఇష్టమొచ్చిన చోట వుంటాను. నీకెందుకు?"

"వాడు నీ మనసులో విషంపోశాడు. లేకుంటే ఇలా మాట్లాడుతావా?"

"ఆయన పేరు ఎత్తితే కళ్ళు పేలిపోతాయి."

"ఇదంతా చేసింది వాడే నీ ఆస్తి కాజేయాలన్న కుట్రతో ఇలా నామీద లేనివి కల్పించిలోబరుచుకుని ఏకంగా ఇంటికి తెచ్చాడు"

"నోర్ముయ్యి. ఎవరెలాంటివారో, ఎవరి బుద్ధులు నీచమైనవో నాకు బాగా తెలుసు. అనవసరంగా నన్ను విసిగించకు"

అంతవరకూ మవునంగా వుండిపోయిన దుర్గాబాయి కల్పించుకుని అన్నది "పోనీ రెండురోజులు వుండనివ్వరాద టండీ, అమ్మాయి ముచ్చటపడుతుంది ఈ మాత్రానికెందుకు కోపతాపాలు" అని నచ్చచెప్పబోయింది. హేమాదేవి ఉరిమి చూస్తూ "మీరందరూ కలిసి దీనీ మనసు విరిచేశారు. ఈపనికి

మాలినది మీరు మాపేదంతా నటన అని తెలుసుకోలేక పోతుంది" అక్కసుగా అన్నది.

దుర్గాబాయి ముఖం మ్లానయింది.

"కొంచం మర్యాదగా మాట్లాడటం నేర్చుకోండి. అమ్మాయి ఇష్టపడే వచ్చింది ఎవరమూ ఆమెకేమీ చెప్ప లేదు. నీ అంతటి కటినులము కాదు కాబట్టి వస్త్రాసంగారమ్మని చెప్పాము" అభిమానంగా అన్నది దుర్గాబాయి. హేమా దేవి నిలువెల్లా మండి పోతుంది అందర్నీ వరస బెట్టి కాల్చే యాలనిపిస్తూంది.

"బుద్ధి భూము లేలుదామంటే రాతలు గాడిదలుకాద్దా మండట. నీ వెలా తగలడితే నాకెందుకు ఇనప్పెట్టి తాళాలు ఇలా ఇవ్వు నేను వెళ్ళిపోతాను."

"దేనికి తాళాలు? ఇకనుంచి నీకు ఒక్క నయాపైసా కూడా ఇవ్వదలుచుకోలేదు. ఆస్తంతా అనాథలకు రాసేస్తు న్నాను...."

హేమాదేవి అదిరిపడింది. నెత్తిన పిడుగు పడినట్లు కొన్నిక్షణాలు నోటమాట రాలేదు.

"ఏమిటి నీవనేది? ఆస్తంతా అనాథలపాలు చేస్తావా నీకేమన్నా పిచ్చిపట్టిందా? ఎలా బ్రతుకుదా మనుకున్నావు?" వెర్రెత్తిన దానిలా అరిచింది హేమాదేవి

"నా బ్రతుకును గురించి నీవేమీ బెంగ పెట్టుకోకు. నా విషయం నాకు తెలుసు అనవసరంగా అరవక వెళ్ళిపో —"

"మరి సాకి సంతరించినదాన్ని నేనేమయిపోవాలి?"

గంగలో దూకు సాకి సంతరించావా! సిగ్గు వేయడం లేదూ ఆమాట అనడానికి. ఇంత ఆస్తి పాస్తులుండీ కూడా ఏనాడూ కడుపునిండా తిన నోచుకోలేదు, చెప్పుకుంటేనాకే సిగ్గనిపిస్తుంది. ఏనాడన్నా ప్రేమగా పలకరించిన పాపాన పోయావా? అనుక్షణం నరకాన్ని చవిచూపావు నీకో పదివేల నమస్కారాలు నాజోలికి రాకు నా బ్రతుకు నేను బ్రతగ్గలను" చేతులు జోడించింది అసహనంగా.

"నీ వెందుకిలా మాట్లాడుతున్నావో నాకర్థమవుతుంది. ఏ అండ చూసుకుని ఇంతకు తెగించావో వాడి అంతూ, నీ అంతూ చూస్తాను." కారాలు మిరియాలు నూరుతూ వెళ్ళిపోయింది హేమాదేవి.

"ఛీ... వెధవ మనిషి. ఎంతసేపూ డబ్బు గురించేగాని మరో ధ్యాస లేదు. ఏదో చేస్తుందట ఏంచేస్తుంది తలకాయ" కసిగా తిట్టుకుంది సుజాత

"దేనికమ్మా ఆమెతో వైరం పెంచుకున్నావు?" ఆప్యాయంగా తలనిమురుతూ అన్నది దుర్గాబాయి.

"ఆమె సంగతి నీకు తెలియదమ్మా. బ్రహ్మరాక్షసి అవిటిదాన్ని చేసి ఇన్నాళ్ళూ జలగలా పీక్కు తిన్నది. పాముకు కోరల్లో విషముంటే ఆమెకు నిలువెల్లా కాలకూట విషమే.

నా సొమ్ము తింటూ నాకే ముప్పు తేవాలని చూసింది—"అని ఆవేశ పడిపోయింది సుజాత.

"ఊరుకోమ్మా ఆవేశపడకు" అని ఓదార్చింది దుర్గా బాయి.

# 18

ఓ నెల్లాళ్ళు గడిచిపోయాయి. తోటలో బిల్డింగ్ వర్క్ బాగాసాగుతుంది. డబ్బు మంచినీళ్ళప్రాయంగా ఖర్చవుతోంది. చంద్రమోహన్ తన సొంతపనిలా శ్రమిస్తు న్నాడు. ఉదయం అన్నంతిని సైకిల్ తీసుకుని వెళితే మళ్ళీ రాత్రి పొద్దుపోయాకగాని రావడంలేదు.

ఆ రోజు సుజాత అతను తోటకు వెళ్ళబోతుంటేగా పిలిచింది. ఏమిటంటూ వచ్చాడు చంద్రమోహన్ ఆమె గదిలోకి.

"ఈ చెక్కు మీ దగ్గర ఉంచుకోండి" అని అన్నది రెండు వేల చెక్కు ఇస్తూ.

"ఇప్పుడు డబ్బు అవసరంలేదు. కావల్సినప్పుడల్లా నేనే అడుగుతున్నానుగా.

"ఇది మీ సొంతానికి వుంచుకోండి. ఇంట్లో వస్తువులు నిండుకున్నట్లున్నాయి. బజారు వెళ్ళి కావాల్సిన సరుకులు కొనండి. కావాలిస్తే మరో రెండువేలు తీసుకోండ్" అని అన్నది.

"మీ మాటలు అర్థంలేకుండా పోతున్నాయి. నా సొంతానికి దేనికి. ఇప్పుడు నాకేం అవసరంలేదు ఉంచండి మీ దగ్గరే—" అని తిరిగి ఇచ్చేశాడు చెప్పాను.

"అది కాదండీ ఇలా రేయింబవళ్ళు శ్రమపడుతున్నారు ఏమిచ్చినా మీ ఋణం తీరదు. ఏదో నా తృప్తికోసం తీసుకోండి మీరు కాదంటే నాకు బాధగా వుంది-" నొచ్చుకుంటూ అన్నది

"అంటే నేను చేస్తున్నపనికి జీతమిస్తున్నారా?..."

"అబ్బే: అలాంటి ఉద్దేశ్యంతో లేదు..." అపార్థం చేసుకుంటున్నాడని కంగారుపడిపోయింది.

"చూడండి! మాకు డబ్బుతో అవసరం ఉండవచ్చు. కానీ, పూర్తిగా డబ్బు మనుషులంకాదు. మాకూ మనసులూ, మమతలూ వున్నాయి. కేవలం డబ్బుకోసమే ఈ పనులు చేయడంలేదు. ఇంకెప్పుడూ ఇలా కించపరచకండి—" అని సైకిల్ ఎక్కి వెళ్ళిపోయాడు చంద్రమోహన్.

సుజాత అతను వెళ్ళిన వేపే చూస్తూ కొయ్యబారి పోయింది కొన్ని క్షణాలు.

'డబ్బుకోసం చేయడంలేదీ పనులు? అంటే ఏమిటి అర్థం? అభిమానంతో సాయం చేస్తున్నాడా లేక మరో అభిప్రాయం ఉన్నదా! వుంటే ఏమిటది? దాని స్వరూపం ఎలాంటిది?—తనమీద జాలీ సానుభూతి కాక అతని హృదయంలో 'మరోటి' వుందా? అంతే వుంటుంది. అలా తను ఊహించినట్లు' ఆయనకు తనమీద ప్రేమవుంటే? ఎంత అదృష్టం! బంగారు పూలతో పూజించనూ! భగవాన్! నా ఆశలు ఫలించేట్లు దీవించు తండ్రీ. ఆయన హృదయంలో కాస్తంత చోటు కల్పించు ప్రభూ! ఇంతకన్నా ఈ జీవితానికి మరేమీ కోరను—" అని చేతులు జోడించింది శూన్యంలోకి.

* * *

ఆ రోజు సాయంత్రం చంద్రమోహన్ తోటనుండి వస్తుండగా పార్కు గేటువద్ద వాహిని కనిపించగా ఆశ్చర్య పోయాడు. ప్రక్కన మరో అతను వుండడం చూసి మరింత ఆశ్చర్యపోయాడు. సైకిలు దిగి దగ్గరగా వచ్చాడు.

"ఏమ్మా వాహినీ! ఇక్కడ నిలబడ్డావేమిటి?" అని ప్రశ్నించాడు ప్రక్కనున్న వ్యక్తిని పరిశీలనగా చూస్తూ.

"ఓ అన్నయ్యా! నీ కోసమే ఎదురుచూస్తూ నిల బడ్డాం—" అన్నది జంకూ గొంకూ లేకుండా.

"నా కోసమా! దేనికి?"

"నీతో పని బడింది. రా చెబుతాను సైకిల్లాక్ చేసిరా కాస్సేపలా కూర్చుందాం..." అన్నది పార్కులోకి

దారితీస్తూ వాహిని వెంట కృష్ణకూడా నడిచాడు. "నాతో పనేమిటి? ఆ ప్రక్కనున్నతను ఎవరు! వారిద్దరికీ ఎప్పటి సంబంధం అని ఆలోచించుకుంటూ సైకిల్ లాక్ చేసి పార్కు లోకి నడిచాడు చంద్రమోహన్.

దూరంగా మనుషులెవరూ లేనిచోటపచ్చికలోకూర్చున్నారు ముగ్గురూ.

"ఈయన కృష్ణ నా క్లాస్‌మేట్ –" అని కృష్ణను పరిచయం చేసింది.వినయ పూర్వకంగా నమస్కరించాడు కృష్ణ. ప్రతి నమస్కారం చేశాడు చంద్రమోహన్ ఆ ప్రయత్నంగా.

కొన్ని క్షణాలు మౌనంగా కరిగిపోయాయి.

"ఏమిటమ్మా ఏదో పని అన్నావు?" అని తానే అడిగాడు చంద్రమోహన్.

"అదే ఆలోచిస్తున్నాను. నీతో ఎలా చెప్పాలాని." సందేహంగా ఆగిపోయింది.

"ఏమీ లేదండి. నేనూ మీ చెల్లెలు ప్రేమించుకున్నాం పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాం. మీ ఆశీర్వాదం కావాలి" అన్నాడు నవ్వుతూ కృష్ణ.

చంద్రమోహన్ ముందే అలాంటిదేదో వుంటుందని వారి వైఖరిని బట్టి గ్రహించాడు గనుక పెద్దగా ఆశ్చర్య పోలేదు కాకపోతే వెంటనే మాటలు దొర్ల లేదు.

"అన్నయ్యా! ఈ విషయం చాలా రోజులనుండి నీకు చెప్పాలనుకున్నాను. కానీ, సిగ్గుతో" పూర్తిగా చెప్పలేక తలదించుకున్నది వాహిని.

కృష్ణను, వాహినీని మార్చి మార్చి చూసాడు చంద్రమోహన్, చక్కగా ఈడూ జోడు బావుందిఅనిఅనుకున్నాడు అతని పెదవులపై మందహాసం వెల్లి విరిసింది.

"బావుంది. అంతా అయిపోయాక ఇప్పుడు చెబుతున్నా రన్నమాట-" నవ్వుతూ అన్నాడు చంద్రమోహన్.

"ఎక్కడ అయిపోయిందండీ-అసలు కథఇప్పుడే మొదలవబోతోంది-" తానూ నవ్వాడు సరదాగా కృష్ణ.

"అన్నయ్యా! మాకో హెల్ప్ చేసి పెట్టాలి నువ్వు-"

"ఊఁ కానీయ్ ఏమిటో అది-" నవ్వుతూనే అన్నాడు చంద్రమోహన్.

"ఏం లేదండీ, మా నాన్నగారు డబ్బు మనిషి. ఆయనకు డబ్బు వుంటే చాలు అన్నింటిల్కూ కూడా అవసరం లేదు. గొంతెమ్మ కోరికలతో మాకు అడ్డు నిలిచాడు రావణాసురుడిలా-" అని నవ్వుతూనే తమాషాగా చెప్పాడు కృష్ణ.

"అయితే మీ పెద్దవాళ్ళకు ఇష్టంలేదన్నమాట మీ పెళ్ళి పాతకథే-"

"అందుకే నీ సహాయాన్ని అర్థించేది" జాలిగా చూసింది వాహిని

"చెప్పండి నే నేం చేయాలో-"

"వారి నాన్నగారితో మాట్లాడి వప్పించాలి-"

"ఆయన ఒప్పుకోక పోతే?"

"మంచిగా చెప్పి చూస్తాం. వింటే అందరం కలిసే వుంటాం-వినకపోతే ఆయన ఖర్మ మా పెళ్ళిమాత్రంఆగదు" ధృఢ గంభీర స్వరంతో అన్నాడు కృష్ణ.

చంద్రమోహన్ మౌనంగా వుండిపోయాడు.

"అమ్మా నాన్నలకు కూడా నీవే సర్ది చెప్పాలి-" నెమ్మదిగా అన్నది వాహిని.

చంద్రమోహన్ పెదవి కదపలేదు. వాళ్ళిద్దర్నీ చూస్తు న్నాడు నిశితంగా.

"ఏమన్నయ్యా మాట్లాడవ్రూ?" భుజం పట్టుకుని కుదిపింది వాహిని.

"చూస్తున్నాను మీ వాలకాల్ని. పెద్దలు కాదన్నా మీ పెళ్ళి మీరే చేసుకునేంత వరకూ వచ్చారు. ఇక ఎవరు ఆపినా ప్రయోజనం లేదు. ఓకె, మీ పెళ్ళి భారాన్ని నా భుజస్కంధాలమీద వేసుకుంటున్నాను." చిరునవ్వుతో అన్నాడు చంద్రమోహన్.

"నేను చెప్పలేదూ మా అన్నయ్య బంగారనీ" మెచ్చుకోలుగా అన్నది కృష్ణవంక చూస్తూ.

"అట్టే పొగడకు. పెళ్ళి భారాన్ని మాత్రమే వేసుకుంటా నని అన్నాను గానీ, పెద్దల్ని వప్పిస్తానని అనలేదుగా. ఆ బాధ్యత మీదే— ఎలా వప్పిస్తారో, ఏం చేసుకుంటారో మీ ఇష్టం. నా బాధ్యతల్లా మీచేత దండలు మార్పించడమే—"

"మళ్ళీ ఇదేమిటన్నయ్యా!" అంటూ గారాలు గుని సింది వాహిని.

"ఆ పప్పులేం ఉడకవు. కానీ కట్నం లేకుండా మంచి వాణ్ణే కొట్టేశావ్."

"నాకు కోప మొస్తుంది—" బుంగమూతి పెట్టింది వాహిని.

"వద్దులే తల్లి! అలాగే చేస్తాను మి ఇద్దరి బాధ్యతా నాదే సరేనా—" అంటూ నవ్వాడు చంద్రమోహన్. వాహిని ముఖం విప్పారింది.

అన్నాచెల్లెళ్ళ చిరుతగవులు చూస్తుంటే కృష్ణకు ముచ్చటగా వుంది. తనకూ అలా గారాలు గునిసే ఓ చెల్లెలుంటే ఎంత బావుండేది అని అనుకున్నాడు కృష్ణ.

చీకటి తెరలు భూమ్మీద ఆక్రమించుకోసాగాయి.

లేచి బయటకు వచ్చారు ముగ్గురూ- కృష్ణ వారివద్ద శెలవు తీసుకుని వెళ్ళిపోయాడు.

చంద్రమోహన్ వాహిని కబుర్లు చెప్పుకుంటూ ఇంటి దారి పట్టారు.

వాహిని మనసిప్పుడు ప్రశాంతంగా వుంది అందుకే అంత హుషారుగా కబుర్లు చెబుతోంది. చెల్లెలి ఉత్సాహాన్ని చూసి నవ్వుకున్నాడు చంద్రమోహన్.

# 19

నమస్కారండీ రామనాథంగారూ!"

"ఎవరయ్యా నీవూ?" ముఖం చిట్లించుకుని చూసారు రామనాథంగారు.

"నేను మీకు తెలియదులేండీ. మీరుమాత్రం నాకు బాగా తెలుసు!" నవ్వుతూవచ్చి కూర్చున్నాడు చంద్రమోహన్. అంత చొరవగా వచ్చి తనఎదుట కూర్చున్న వ్యక్తికేసి ఆశ్చర్యంగానూ, విస్మయంగానూ చూసారు రామనాథంగారు.

"ఏం కావాలి?"

"మీతో మాట్లాడాలి కొంచం"

"ఏమిటో చెప్పు-" ముఖం ముడుచుకున్నారు అయిష్టతగా. ఈ సామాన్యవ్యక్తికి తనతో మాట్లాడేదేమిటి" అన్నట్లుంది ఆయన ధోరణి. ఆయన వైఖరి గమనించిన చంద్రమోహన్ తనలోతాను నవ్వుకున్నాడు.

"కృష్ణనాకు బాగా కావాల్సినవాడు అందుకే మీవద్దకు పంపాడు నన్ను."

"దేనికి?"

"పెళ్ళివిషయం మాట్లాడిరమ్మన్నాడు మీతో."

రామనాథంగారు మాట్లాడలేదు చంద్రమోహన్ కల్పించుకున్నాడు.

"కృష్ణ పెళ్ళిచేసుకోబోతున్నాడు—ఆవిషయం మీతో చెప్పమన్నాడు."

"ఏమిటీ పెళ్ళి చేసుకుంటున్నాడా! ఎవరిచ్చారు వాడికా అధికారం" మండిపడ్డాడు.

"శాంతించండి అసలు విషయమేమిటంటే, కృష్ణ వాహిని అనే అమ్మాయిని ప్రేమించాడు ఆఅమ్మాయినితప్ప మరొకర్ని చేసుకోనని పట్టుబట్టాడు. మీరు వప్పుకోలేకపోతే రిజిష్టరు మ్యారేజీకి సిద్ధమయ్యాడు. నన్ను వెళ్ళి ఈవిషయం మీ చెవిన వేయమన్నాడు."

"ఎంత ధైర్యం! నన్ను ఎదిరించి ఆ పిల్లను చేసుకుంటాడా బ్రతకడానికే! నామాటగా వెళ్ళి వాడికి చెప్పు. ఇలాంటి వేషాలు వేస్తే ఆస్తిలో చిల్లిగవ్వ కాదుగదా పూచిక పుల్లకూడా దక్కదని చెప్పు. ఏ అనాథ శరణాలయానికో రాసిపారేసి తిరుక్కుకుదురుస్తాను."

"తనకు ఆస్తి అక్కర్లేదట."

"అదుక్కుతింటాడా! ఆస్తిలేకుండా యెలా బ్రతుకుతాడు?"

"కూలిపనిచేసి అయినా తన భార్యను పోషించుకుంటాడట..."

రామనాథంగారు ఉద్రేకంతో మాట్లాడలేకపోయారు. ఆయన పడే అవస్థగమనించి చంద్రమోహన్ ఇలా అన్నాడు. "మిమ్ముల్ని చూస్తుంటే నాకు జాలేస్తుంది ఒక్కగానొక్క కొడుకు ఇంతటి సిరిసంపదలు ఉండికూడా మీరు యేకాకికావాల్సివస్తుంది."

"అదేనయ్యా నాబాధ? ఇన్నాళ్ళూ రెక్కలుముక్కలు చేసుకుని కూడబెట్టాను. ఎవరి కోసం వాడికోసం కాదూ? ఇదంతా నేను కట్టుకుని పోతానా! ఈ క్షణంగా నాలుగు లక్షలు కట్నమిచ్చి పిల్లనిస్తామంటే కాదని ఎవతినో ప్రేమించానని ఆఘోరిస్తాడా? నా పరువుప్రతిష్ఠలేం కావాలి? వీడి

వెధవవని చేస్తే నేను నలుగురిలో తలెత్తుకు తిరిగేదెలా? బాధగా నుదురు కొట్టుకున్నారు.

"అందుకే నేనో ఉపాయం చెపుతాను వింటారా?"

"ఏమిటది?" తలెత్తి చూసారు చంద్రమోహన్ వంక.

"ఇప్పుడు మీరు కాదన్నా కృష్ణ వినే స్థితిలో లేడు. అందుకని అతనితో రాజీపడి అతనికిష్టమైన అమ్మాయితోనే వివాహం జరిపించి మీ పెద్దరికం నిలుపుకోండి."

"ఎలాగయ్యా! చూస్తూ చూస్తూ బీద ఇంటి పిల్లను ఎలా కోడలుగా తెచ్చుకోను. నా పరువు-అంతస్తు, హోదా ఏంగానూ?"

"పెద్దవాళ్ళు ఏం చేసినా గొప్పగానే కీర్తిస్తారు. అందుకని-మీకు ఇష్టంలేకపోయినా "అబ్బాయి ఇష్టపడు తున్నాడు. ఈ సిరిసంపదలు శాశ్వతం కావు" అని ప్రచారం చేయండి. అప్పుడు మీ పరువు ప్రతిష్టలకు భంగం వాటిల్లక పోగా సరికదా-రెట్టింపవుతుంది. "ఆదర్శ వివాహం చేసారని మిమ్మల్నే కీర్తిస్తారంతా. అప్పుడు మీ మాటనిలబెడుతుంది. అటు కృష్ణకోరిక నెరవేరుతుంది. ఇంతకన్నా మరో మంచి మార్గంలేదు. ఆలాగూ వాళ్ళు పెళ్ళికి సిద్ధపడ్డారు. మీరు కాదన్నా ఆగరు. అదేదో మీ చేతిమీదనే జరిపించి మీ పరువు ప్రతిష్టల్ని నిలుపుకోండి."

రామనాథంగారు ఆలోచనలో బడిపోయారు. చంద్ర మోహన్ చెప్పింది సబబుగానే తోచింది చివరికో నిర్ణయానికిరాగలిగారు.

"నీ ఆలోచన బాగానేవుంది. కాని చదువు మధ్యలో వదలేసి ఇప్పుడు పెళ్ళేమిటి?"

"చదువు అయిపోయేదాకా వాళ్ళు ఆగవద్దూ అయినా చదువుదారి చదువుదే పెళ్ళిదారి పెళ్ళిదే..."

"సరే చూద్దాం, వాడిని తొందరపడవద్దని చెప్పు-"

"అలాగే. ఏ విషయం త్వరగా ఆలోచించుకోండి." ఆ కాస్తా జరిగిపోయాక మనం చేయగలిగిందేంలేదు- రేపు కస్తాను-" అని లేచి బయటపడ్డాడు అతను.

"ఫర్వాలేదు, ముసలాయన మెల్లిగా దారికి వస్తాడు. ఇక అమ్మానాన్నలు, వాళ్ళదేముందిలే. తనుచెబితే కాదనరు. మంచి సంబంధం. వాహినీ సుఖపడుతుంది. కృష్ణ కూడా మంచివాడు అసలు ఆ తండ్రి కడుపున పుట్టాల్సిన వాడుకాదు."

అని హాయిగా నిట్టూరుస్తూ ఇంటివేపు నడక సారించాడు అతను.

ఆ తరువాత దుర్గాబాయిని, రామచంద్రయ్యగారినీ. ఎలాగైతేనేం-వాహినీ పెళ్ళికి ఒప్పింపజేసాడు చంద్ర మోహన్. అతనికి చాలా ఆనందంగావుంది.

వాహిని సంతోషం వర్ణనాతీతం.

చివరకు ఎలాగై తేనేం రామనాథంగారిని పెళ్ళికిఒప్పింప జేసాడు చంద్రమోహన్.

తన అంతస్తుకు తగ్గట్టుగానే ఏలోపమూజరక్కుండా ఘనంగా పెళ్ళి చేసారు.

వాహిని కృష్ణల పెళ్ళిసవ్యంగా జరిగిపోయింది చంద్ర మోహన్ తేలిగ్గా నిట్టూర్చాడు.

రామచంద్రయ్యగారూ. దుర్గాబాయి, తమకూతురు గొప్పింటి కోడలయినందుకు సంతోషించారు.

కాలం దూసుకు పోతుంది. ఎవరికోసమూ ఆగకుండా అతివేగంగా దొర్లిపోతుంది.

సుజాత కూడా ఆ ఇంటి సభ్యుల్లో ఒకదానిలా బాగా కలిసిపోయింది. దుర్గాబాయిని 'అత్తయ్యా! అంటూ కలివి. డిగా పిలుస్తూ వారిలో బాగా కలిసిపోయింది. చంద్ర మోహన్ రోజూ తోటకు వెళ్ళి వస్తున్నాడు. అక్కడ పని చాలా చురుకుగా సాగి పోతుంది. ఆ రోజు సుజాత రామ చంద్రయ్యగారి వద్దకు వీల్ చైర్ జరుపుకుని వచ్చింది.

"మామయ్యా!" అని పిలిచింది నెమ్మదిగా.

"ఏమిటమ్మా?" అని ఆప్యాయంగా పలకరించారు రామచంద్రయ్యగారు.

"సంక్రాంతి పండుగ వస్తుంది మన అందరికీ బట్టలు తీసుకురండి. వాహినీకి పెళ్ళయినతరువాత ఇదే తొలిపండుగ వాళ్ళిద్దర్నీ రమ్మని కబురంపండి. బట్టలుపెట్టి పంపుదాం–" అన్నది డబ్బు ఆయనకిస్తూ.

"దేనికమ్మా ఇప్పుడు అనవసరంగా ఖర్చు –అంతగా కావాలిస్తే ఊరికే పండక్కి పిలుద్దాం వాళ్ళకేం తక్కువ– అన్నీ సవ్యంగానే జరుగుతున్నాయి–" మొహమాటపడ్డారు ఆమెనుండి డబ్బు తీసుకోవడానికి.

"వాళ్ళకు ఎన్ని వున్నా, మన సంతోషం కోసం మనం పెడుతున్నాం. అత్తవారికి ఎన్ని సిరిసంపదలున్నా ఆడపిల్లకు పుట్టింటి వాళ్ళపై మమకారం వుంటుంది. ఉత్త చేతులతో పంపడం ఏమీ బాగోదు. వెళ్ళి రెండు పట్టు చీరలు, మన అందరికీ కాస్త మంచివిచూసి తలా ఓ రెండు జతలూ తీసుకు రండి. దేవుడు నన్ను కదలకుండా చేసాడు. లేకుంటె నేనే స్వయంగా వెళ్ళి తీసుకు వద్దామను కున్నాను–" అన్నది సుజాత.

"ఏమో నమ్మా, అబ్బాయికి తెలిస్తే బాధపడతాడు అయినా, ఆడపిల్లవు నీడబ్బు ఖర్చుపెట్టించడం నాకుమనస్కరించడంలేదు. ఏమీ అనుకోకమ్మా"

ఇంతలో దుర్గాబాయి అక్కడకు వచ్చింది. విషయం తెలుసుకుంది.

"నీవైనా చెప్పు అత్తయ్యా! నా డబ్బు దేనికీ పనికి రాకుండా పోతుంది. ఆ మాత్రం నేను తీసుకురా తగనా

ఇన్నాళ్ళూ మీ ఆత్మీయను రాగాలు పంచుకుంటూ మీ బిడ్డలాగానే మెలిగాను. మీ మీద నాకా మాత్రం అభిమానం వుండ కూడదా?" కళ్ళు చెమ్మగిలు తుండగా అన్నది సుజాత.

"అదికాదు సుజాత! నీ డబ్బు పనికిరాదని కాదు. ఇలా నీ చేత వేలకు వేలు ఖర్చు చేయించడం ఏమైనా బాగోదు. ఆనక చంద్రం వచ్చాక అడిగి తీసుకురావచ్చులే- ఊరుకో. నిన్ను పరాయి దాసిలా ఎప్పుడూ చూడలేను." అన్నది అభిమానంగా దుర్గాబాయి.

ఇంత చేస్తూకూడా ఒక్క కానీ ఆశించని వారి మంచితనానికి చలించి పోయింది సుజాత. గిర్రున కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"అదేమిటమ్మా! ఎందుకేడుస్తావు. ఊరుకో-" కంగారు పడ్డారా దంపతులు.

"ఏడుపు కాదు మామయ్యా! ఆనంద బాష్పాలు కన్న వాళ్ళ ప్రేమకు నోచుకోని నాకు మీ మంచితనం, మమకారం చూస్తుంటే గుండెలు భరించలేకున్నాయ్. మీకేమీ చేయలేకపోతున్నానని బాధగానూ వుంది." కళ్ళు తుడుచుకుంటూ అంది సుజాత.

"నీలాంటి భాగ్యవంతురాలు వచ్చి మా ఇంట్లో వుండడమే మాకు మహానందం ఏమీ చేయలేనని ఎందుకనుకోవాలి ఊరుకో" అన్నారు రామచంద్రయ్యగారు.

"ఏమైనా సరే మీరు బట్టలు తీసుకురావాల్సిందే ఇదే నా ప్రార్థన ఈ ఒక్క కోరికా మన్నించండి ఆయనకు ఆ మనసే. అసలే ఒప్పుకోడు, నాకోసం రేయింబవళ్ళు కష్టిస్తు న్నారు. ఏ ప్రతిఫలాన్నీ కోరడు. మీ అందరి మ చితనాల వసుందు నా తల వాలిపోతుంది. ఈ ఒక్కసారికి నన్ను మన్నించి నా కోరిక తీర్చండి-" అని బలవంతాన నోట్లకట్టను ఆయనచేతిలో వుంచింది సుజాత.

"తీసుకోండి అమ్మాయి బాధపడిపోతుంది" అన్నది దుర్గాబాయి.

తలూపుతూ కదిలారు రామచంద్రయ్యగారు.

"మామయ్యా డబ్బు కోసం వెనకాడక వాహినీకి రెండు మంచివి పట్టు చీరెలు తీసుకోండి. మన కూడా కొంచం ఖరీదైనవే తీసుకోండి అన్నది వెనకనుంచే సుజాత.

అలాగేనన్నట్లు తలూపి కదిలిపోయారు రామ చంద్రయ్యగారు.

సుజాత తృప్తిగా నిట్టూర్చి "అత్తయ్యా! ఈ సంగతి చంద్రం గారికి చెప్పకండి." అని అన్నది.

"ఎలాగమ్మా! ఈ ఇంట్లో వాడికి తెలీకుండా మేము ఏదీ జరపము ఇప్పుడిలా తెలీకుండా చేస్తే మనసు నొచ్చు కుంటాడు వాడికి నే నెలాగో నచ్చచెపుతాలే-" అన్నది దుర్గాబాయి.

సరే మీ ఇష్టం. ఆయన భారం మీదే. నా మీదకు తగువుకు రాకుండా చూడండీ అన్నది సుజాత నవ్వుతూ దుర్గాబాయి కూడా నవ్వింది తేలిగ్గా.

"అత్తయ్యా! పండక్కి వాహినీ వాళ్ళు వస్తే ఏం చేద్దాం?"

"ఎప్పుడో వారం రోజుల సంగతిగా అప్పుడు చూద్దాం లే" అన్నది నవ్వుతూ దుర్గాబాయి.

"ఊహుఁ... అలా కాదు. ఈసారి పండుగ చాలా బ్రహ్మాండంగా చేసుకుందాం. నా జీవితంలో యెప్పుడూ ఇంతటి ఆనందాన్ని పొందలేదు. ఇంకరి ఆత్మీయుల మధ్య పండుగ సంబరాన్ని ఘనంగా చేసుకోవాలనిపిస్తుంది. ఈసారి పండక్కి నేను ఇక్కడవుండను"

"అలాగే నీ ఇష్ట ప్రకారమే చేద్దాం" అని అన్నది దుర్గాబాయి.

సుజాత మనసు శాంతించింది.

రాత్రి భోజనాల దగ్గర చంద్రమోహన్‌కి నెమ్మదిగా విషయం చెప్పింది దుర్గాబాయి.

"ఆ అమ్మాయి బాధపడుతుంటే తప్పదు బాబూ"

"ఏమైనా ఆమె డబ్బు మనకోసం ఖర్చు పెట్టుకోవడం బాగోదమ్మా—"

"పోనీలే ఈ ఒక్కసారి ఆ పిల్ల సంతోషం కోసం అలా చేసాము. మళ్ళీ ఆ విషయం ఆమె దగ్గర ఎత్తకు-బాధ పడుతుంది.

"అలాగే అమ్మా, ఆమె ఆనందాన్ని మన మెందుకు కాదనాలి. రేపే వెళ్ళి వాహినీ వాళ్ళకు చెప్పివస్తాను" అన్నాడు చంద్రమోహన్.

"భోజనం ముగించుకుని తనగదిలోకి వెళ్ళబోతుండగా వరండాలో సుజాత కనిపించింది చంద్రమోహన్‌కి. అంత వరకు అక్కడ వుండి తన మాటలు వింటున్నదని గ్రహించి నవ్వుకున్నాడు అతడు.

అతని ముఖం నవ్వుతూ ప్రసన్నంగా వుండడం చూసి అవతలకు వచ్చింది సుజాత.

"ఏమిటి మీలో మీరే చూసి నవ్వుకుంటున్నారు?" అని అడిగింది సుజాత.

"నిన్ను చూసే- ఈ మధ్య మీరు అని పిలవడం మానేశాడు. ఆమె అలా పిలవద్దని అంటున్నది. అందుకని నిన్ను అనో సుజాతా అనో సంబోధించడం అలవరుచుకున్నాడు చంద్రమోహన్.

"నా ముఖాన తోలు బొమ్మలు ఆడ్డం లేదు" వాళ్ళ మాటలు వినడం గ్రహించాడని ఉడుక్కుంది.

"మరి లేకుంటే ఏమిటిది? చేసేపని నాకు తెలియకుండా చేసేసి అమ్మద్వారా వర్తమాసు పంపుతావా?"

"మీరంటే నాకేం భయం కాదు. లేకుంటే——"

"లేకుంటే—" నవ్వుతూ రెట్టించాడు.

"ఏమీ లేదులే. వెళ్ళండి" అన్నది సుజాత.

చంద్రమోహన్ కదిలాడు నవ్వుకుంటూ.

"చూడండి రేపు వెళ్ళి వాహినీ వాళ్ళను నాలుగు రోజులు ముందుగానే రమ్మని చెప్పి వెంటబెట్టుకుని రండి వాహిని పెళ్ళయ్యాక మరీ నల్లపూస అయింది" అనిఅన్నది

"నాలుగు రోజులు ముందుగా పిలిస్తే మా కొంప గుల్లయి పోతుంది" హాస్యంగా నవ్వాడు.

"ఈ సారి పండుగ ఖర్చు అంతా నాదే. మీరు అడ్డు తగిలితే ఊరుకునేది లేదు."

"మీ యిష్టం వచ్చినట్లు చేసుకోండి మీ ఆడవాళ్ళ వ్యవహారంలో నేనేమి కలగ జేసుకోను" అని నవ్వేసి వెళ్ళి పోయాడు అతడు. "మనిషికి అంత మంచి మనసు ఉండబట్టే మరీ ఇంతఅందంగా కనిపిస్తున్నాడు ఏపుణ్యావతి పెట్టిపుట్టిందో ఇతన్ని భర్తగా పొందడం ఆమె చేసుకున్న పూజాఫలం—" అని అనుకున్నది సుజాత.

# 20

వాహినీ కృష్ణ నాలుగు రోజులు ముందుగానే వచ్చేశారు. అందులో కాలేజీకి పండుగ శెలవులు కావడంతో మరేమి అభ్యంతరం లేకపోయింది. ఇల్లు కళకళలాడుతోంది సుజాత ఆనందం వర్ణనాతీతం. అన్నీ తన యిష్ట ప్రకారమే చనువుగా పోట్లాడి మరీ జరిపిస్తుంది. వాహినితో చిరు తగవులు పెట్టుకుని హాస్యాలాడుతూ అలా గడిపేయడంలో సుజాతకు యెంతో ఆనందంగా వుంది.

భోగి ముందురోజు ఇల్లంతా బూజుదులిపి శుభ్రంగా అలికి ముగ్గులు పెట్టారు. గోడలకు సున్నం పూయించారు. గడపలకు లక్క పూచారు. సంక్రాంతి శోభతో ఆ ఇల్లు ముచ్చటగా వెలిగిపోతోంది.

వాహినీని పంపి ఆవు పేడ తెప్పించింది సుజాత. ఇద్దరూ కలసి గొబ్బిమ్మలు చేసారు చిన్న పిల్లల్లా. పాటలు పాడి పేరంటం లాంటిది చేసారు. ఇవన్నీ చూస్తూ ఊరుకున్నాడే తప్ప మరేమీ అనలేదు చంద్రమోహన్. సుజాతలో మునుపెన్నడూ చూడని కొత్త సంబరాన్ని చూసి తృప్తిగా నిట్టూర్చాడు.

పండగరోజు అందరూ తలస్నానాలుచేసి కొత్తబట్టలు ధరించారు. ఆ వేళ చంద్రమొహన్ కూడా ఇంట్లోనేవున్నాడు స్వీట్లూ, హాట్లూ చేసింది దుర్గాబాయి. రక రకాల పిండి వంటలు కూడా చేసింది.

"ఏమిటి వదినా మరదళ్లు కలసి సంబరమంతా ఏం చేసుకుంటున్నారు" గదిలోకి వస్తూ నవ్వుతూ అన్నాడు చంద్రమొహన్.

"ఏం మీకు అసూయగా వుందా-"గడుసుగా అన్నది సుజాత.

"ఉండదా మరి మీరిలా నిష్కల్మషంగా నవ్వుల పండుగ చేసుకుంటే."

"మీరు భాగం కలవండి ఎవరొద్దన్నారు"

"ఒకరొద్దంటే ఆగిపోతానా? అందుకేగా వచ్చింది." చిలిపిగా నవ్వాడు చంద్రమోహన్.

సుజాత సిగ్గుపడి పోయింది కొన్నిక్షణాలు.

"అన్నయ్యా! వదిన ఏమని అడుగుతుందో తెలుసా? చెప్పనా వదినా?" అన్నట్లు ఉడికించింది.

"ఏయ్ మొద్దూ! ఊరుకో" చిరుకోపంతో కసురుకుంది సుజాత.

"ఏమన్నదేమిటి?" రెట్టించి అడిగాడు చంద్రమోహన్.

"మీా అన్నయ్యకు పెళ్ళిచేయరా అని అడుగు తోంది-"

ఎందుకో ఆమాటకు చంద్రమోహాన్ తెరలు తెరలుగా నవ్వాడు.

సుజాత సిగ్గుతో చితికిపోయింది. వాహినీకి మరి బుద్ధి లేదు. ఏదో సరదాకు అంటే- ఆయనతో చెప్పేసిందిఅలా అన్నందుకు ఆయనేమనుకుంటాడు! నా పెళ్ళితో ఈవిడకేమిటి సంబంధం-అనుకోడు." అని అనుకుంది సుజాత.

"చేసుకుంటాను అందమైన అమ్మాయి తటస్థపడి నప్పుడు నవ్వుతూనే అన్నాడు చంద్రమోహన్.

"ఊరికే అన్నాను ఏమీాఅనుకోకండి" నొచ్చుకుంటూ అన్నది సుజాత.

"అలా అడగడంలో వదినఅంతర్యమేమిటో?" చిలిపిగా చూస్తూ నవ్వేసింది వాహిని.

సుజాత వుడుక్కుంది.

"బావుంది. నేనేదో సరదాకంటే ఆ మాట పట్టుకుని ఆటలు పట్టిస్తున్నారు."

"మేమూ సరదాగానే అడుగుతున్నాంవదినగారూ!" అంతకోపమయితే ఎలా?

"ఏమిటో సరదాలంటున్నారు ఏమిటి కథ?" తలెగరేస్తూ చిరుదరహాసాలు చిందిస్తూ కృష్ణ ప్రవేశించాడు.

“రా అన్నయ్యా! పిళ్ళిద్దరూ కలిసి నన్ను యేడిపిస్తున్నారు-” ఫిర్యాదు చేస్తున్నట్లు చెప్పింది సుజాత.

“ఈ చెల్లెలికి ఈఅన్నగారు వత్తాసు-”నాలుకబయట పెట్టి భర్తను వెక్కిరించింది చిలిపిగా.

“ఏం మీ అన్న నీకు వత్తాసుగా రాగా లేనిది-మా చెల్లెలికి నేను వత్తాసు రావడంతప్పా? ఊఁ... కానీయండి మీ అన్నాచెల్లెళ్ళ ప్రతాపమేమిటో చూస్తాను-” అన్నాడు కృష్ణ సవాల్ చేస్తున్నట్లు.

“ఏం బావగారూ! మహా హుషారుగా ఉన్నారే, ఏమిటికథ-” చంద్రమోహన్ నవ్వాడు కృష్ణను అదోలా చూసి

“ఆఁ... యేముంది అత్తగారు ఇప్పుడే పీకలదాకా పిండివంటలు పెట్టారు. అవికాస్తా అరగొద్దూ” హాస్యంపట్టిస్తూ అన్నది వాహిని.

“నీవేం తక్కువ తిన్నావా మహాతల్లీ! రెండు ప్లేట్లు గారెలు శుభ్రంగా భోజనం చేశావుగా. మా అన్నయ్యకు నీ దిష్టే తగిలేట్లు వుంది. అన్నయ్యా! ఆసక కాసిని మిరపకాయలు దిగదుడిచి వేస్తాలే-” అభిమానంగా కృష్ణను సపోర్టు చేస్తూ అన్నది సుజాత.

“అబ్బో! యేమి ప్రేమ! అన్నగారిమీద ఈగ వాలనీయడం లేదు-”

“నీవు మీ అన్నయ్యను వెనకేసుకు రావడం లేదూ-”

"అబ్బ! పోనీయండ్రా పండగపూట ఎందుకీ గొడవలు! సరదాగా యేదన్నా ప్రోగ్రాం వేసుకుందాం" అన్నాడు చంద్రమోహన్ కల్పించుకుని.

"అవును అదే మంచిది, ఇలా ఇంట్లో కూర్చునేకన్నా సరదాగా ఎక్కడికైనా వెళ్దాం" అన్నాడు కృష్ణ.

"ఇల్లు వదిలి నేను ఎక్కడికీ రాను బాబూ, కావాలి స్తే ఈ మొద్దును వెంటబెట్టుకుని మీరు వెళ్ళండి" సుజాతకు బయటకు వెళ్ళడం యిష్టంలేదు.

"వదినగారు లేకుండా మేము మాత్రం ఎలా వెడ్తాం. వెళితే అందరం కలిసే వెళ్దాం. లేకుంటే యిక్కడే కూర్చుని"

"చక్కగా పోట్లాడుకుందాం ఏం-" మధ్యలో అందుకుని అన్నది సుజాత.

ఆ మాటలకు అందరూ నవ్వేశారు. ఆనవ్వులకు ఆగది మారుమ్రోగింది.

"నాదో చిన్న ఆలోచన" తన అభిప్రాయాన్ని వెలిబుచ్చాలని అన్నది వాహిని.

"ఏమిటది" కృష్ణ అడిగాడు.

"ఏంలేదు. సరదాగా ఏదైనా పందెం పెట్టుకుందాం నీవూ, నీ చెల్లెలు ఒకపక్కన మా అన్నయ్యా నేనూ ఒక జట్టు——"

"పందెమా! ఏమిటది ?" కుతూహలంగా అడిగింది సుజాత.

"రామాయణాన్ని గురించి డిస్కషన్ చేద్దాం. ఒకరు ఔనన్నది మరొకరు కాదని, మరొకరు సబబు అన్నది-రాంగ్ అని వాద ప్రతివాదనలు జరపాలి.ఎలా వుంది మనఐడియా" గర్వంగా తలెగరేస్తూ అన్నది వాహిని.

"నీ ముఖమెలా వుందో- నీ ఆలోచన కూడా అంత దివ్యంగా వుంది-"

"నా ముఖానికేం చంద్రబింబంలా వుంటేనూ?"

"ఛీ...ఫో. నీ ఆలోచనకు నీవే మురిసిపోవాలి-" చిరాగ్గా కసురుకున్నాడు కృష్ణ

"బావగారూ! మా చెల్లి చెప్పింది బాగానేవుందిమన మిలా వాదించుకొన్నందువల్ల కొన్నికొన్ని సత్యాలువాటంతటవే వెల్లడవుతాయి. మంచి కాలక్షేపం కూడా-"అన్నాడు చంద్రమోహన్.

"మీరుకాబట్టి మీ చెల్లిని సమర్థిస్తున్నారు" అన్నాడు వాహినీని తినేసేలా కృష్ణ. వాహినీ వెక్కిరించింది- "తర్వాత నీ పొగరణిచేది" అన్నట్లు బెదిరింపుగా చూశాడు కృష్ణ.

"ఏమిటి మరి, వాదనకు మీరు సిద్ధమేనా? లేక వెనక్కి తగ్గుతారా?" సుజాతను చూస్తూ హాస్యంగా అన్నాడు చంద్రమోహన్.

"మహా అక్కడకు మీరు తెలివిమంతులైనట్లు, మేము దద్దమ్మలమైనట్లు మేమేం తక్కువ తినలేదు. కానీయండి-ఏమన్నయ్యా! వాళ్ళలా తీసేసి మాట్లాడుతుంటే ఊరుకుం

టూవే- కానీయి. రెడీయేనని చెప్పు-" అన్నది సుజాత పౌరుషంగా.

"సరే- మీరందరూ ఓకేనంటే నేనెందుకు కాదనాలి. మొదలెట్టండి-" రాజీకి వస్తూ అన్నాడు కృష్ణ.

"ముందుగా అందరికీ ఓ హెచ్చరిక? ఎవరు ఏ విధంగా వాదించినా, వారి వాదనలో నిజాయితీ వుండాలి. వాదన కోసం ఏదంటే అది కల్పించుకుని మాట్లాడకూడదు. రీజన్‌బుల్‌గా వుండాలి-" అని అన్నది వాహినీ.

"అలా ఎలా కుదురుతుంది. ఎవరు నమ్మిన సిద్ధాంతాలు వారికి మంచిగా కనిపిస్తాయి. అవి ఇతరులకు ఎబ్బెట్టుగా వుండవచ్చు. అంతమాత్రాన వారి మాటల్లో వారి సిద్ధాంతాలలో నిజాయితీ లేదని ఎలా తెలుస్తుంది-" సుజాత కలుగజేసుకుంది.

"ఎవరి సిద్ధాంతాలు, నమ్మకాలను వారు మాట్లాడవచ్చు తప్పు లేదు. కానీ, అసందర్భంగా అవివేకం మాట్లాడవద్దనే మా చెల్లి చెప్పేది-" చిన్నగా నవ్వుతూ అన్నాడు చంద్ర.

"త్వరగా కానీయండ్రా! అదేదో మొదలెట్టండి-" విసుగ్గా అన్నాడు కృష్ణ.

"ఇదేమన్నా పాయసం ప్లేటులనుకున్నారా ఒకదాని వెంట ఒకటి కానీయడానికి. రామాయణాన్ని విమర్శించాలంటే ఎంత శక్తి కావాలి, ఎంత వివేకం కావాలి..."

"ఎంతో గొంతు కావాలి—" తక్కున అందుకుని అన్నాడు కృష్ణ. వాహినీ నవ్వుకుంది భర్త మాటలకు.

అందరూ వాదనకు సిద్ధమైనట్లు గొంతులు సవరించు కుని సరిగా కుర్చీలు జరుపుకుని కూర్చున్నారు. వాహిని, చంద్ర మోహన్ ఒక వేపు కృష్ణ, సుజాత మరో వేపు కూర్చు న్నారు.

"ఇంతటి ప్రశ్న మీకే—" నవ్వుతూ అన్నది వాహిని కృష్ణను ఉద్దేశించి.

"ఐయామ్ రెడీ—" కాలర్ సరిచేసుకున్నాడు కృష్ణ.

"కాలర్ సవరించుకున్నట్లు కాదు. అడిగిన దానికి జవాబు చెప్పాలి—"

"బడాయ్ చాలించి కానీవోయ్ ప్రశ్న—"

"వేస్తున్నా కాసుకో. మొదటి మూడు ప్రశ్నలకు నీవు సమాధానం చెప్పాలి. తరువాత మీరు ప్రశ్నలు వేస్తే నేను జవాబిస్తాను. మన తరువాత వదినా, అన్నయ్యా—" అని నవ్వుతూ" రామాయణం ఎవరు వ్రాశారు?" తొలి ప్రశ్న వేసింది వాహిని.

"ఇంకెవరు? ఆమాత్రం తెలేదా, వ్యాసుడు రాశాడు"

వాహిని పకపకా నవ్వింది. చంద్రమోహన్ కి కూడా నవ్వొచ్చింది.

"ఎందుకలా కోతిలా కిచకిచమంటావు? రామాయణం వ్రాసింది వాస్మీడు కాదా?" ఉడుక్కుంటూ అన్నాడు కృష్ణ

వాహిని నవ్వుతూనే "మొదటి ప్రశ్నలోనే ఫెయిలయ్యారు. రామాయణం ఎవరు వ్రాశారో కూడా తెలీదు. ఇంకేం వాదనకు పనికి వస్తారు?" అన్నది.

'వ్యాసుడో— హరిశ్చంద్రుడో ఎవరో ఒకరు రాశారు లే" గొణుక్కుంటూ అన్నాడు కృష్ణ.

"వాల్మీకి— వాల్మీకి— నెమ్మదిగా అందించింది సుజాత.

"పక్కవాళ్ళెవరూ అందించకూడదు."

"నేనేమీ అందించడం లేదు తల్లీ- గట్టిగా చెప్ప మంటున్నాను" అన్నది సుజాత మూతిముడుస్తూ.

"ఏం కాదులే. మీ అన్నయ్య ఓడిపోతే నామోషీ కదా! అందుకని ఆయన చెవిలో ఊదేస్తున్నావ్" గేలి చేసింది వాహిని. చంద్రమోహన్ మౌనంగా, ముసిముసి నవ్వులు నవ్వుతూ వుండి పోయాడు.

"అయినా ఏమిటీ వెధవ ప్రశ్నలు రెండో తరగతి పిల్లవాడిని అడిగినట్లు? రామాయణం ఎవ్రరాశారు? రాము నికి సీతేమవుతుంది? ఇదా మన వాదన! నాకేం నచ్చలేదు" పెదవి విరిచేశాడు కృష్ణ

"వెనక్కి తగ్గకండి బావగారూ! వాదన మొదలవు తోంది. అంత తొందరపడితే ఎలా? నేను ప్రశ్న వేస్తాను, సుజాత జవాబు చెప్పాలి." నవ్వుతూ అన్నాడు చంద్ర మోహన్.

"సుజాత కలవరపడిపోయింది ఏం అడుగుతాడోనని.

"సాకేతిని అంటే ఎవరండీ?"

"రాముని సపతి అయివుంటుంది—" కృష్ణ మాటలకు అందరూ ఫక్కుమని నవ్వారు.

"ఇంకా నయం, నా సవతి అన్నారు కాదు." వచ్చే నవ్వుకు పెదాల మధ్య బంధిస్తూ అన్నది వాహిని.

"తొందరెందుకు మరొక దాన్ని కట్టుకొని నీ కోరిక తీరుస్తాను."

"మీ బెదిరింపులకేం లొంగను, చేసుకోండి నాకేం!" బింకంగా అన్నది వాహిని.

"అబ్బ! మధ్యలో మీ గొడవతోనే సరిపోయింది. ఇక ముందుకేం వెళతాం-" కొంచం విసుగ్గా అన్నాడు చంద్రమోహన్.

"ముందుకు వెళ్ళకుంటే కొంపలేం మునగవులే ఇక చాలించండి. పనికి మాలిన ప్రశ్నలూ మీరూను. మహా బోర్ గా వుంది, ఆపేయండి" కృష్ణ.

"చెప్పడం చేత గాకపోతే. ఇలాగే వుంటుంది—" వాహినీ కవ్వింపు.

"నాకు చేత అవునో కాదో గదిలోకి రా చెబుతా-" కృష్ణ చిలిపిచూపులు.

"సుజాత! ఇక లేద్దాం. నేరక వీళ్ళతో కలిశాం. అయ్యా బావగారూ! ఇద్దరూ ఆ గదిలోకి వెళ్ళి పోట్లాడుకోండి. మధ్యన వినలేక మేము చస్తున్నాం" అన్నాడు లేస్తూ చంద్రమోహన్.

ఇంతలో దుర్గాబాయి ప్రవేశించి "భోజనాలకు రండి వడ్డిస్తునా" అని చెప్పి వెళ్ళింది.

"మరింకేం పదండి మహా పట్టు పడదాం" ఉషారుగా అన్నాడు కృష్ణ

"దేనికీ పనికిరాకపోయినా, ఇందులో మాత్రం వేలెత్తి చూపనవసరం లేదు." వాహిని వెక్కిరింపు.

"అప్పట్నుంచి చూస్తున్నాను. ఎందుకలా అన్నయ్య మీద ఒంటికాలు మీద లేస్తున్నావు?"

"అన్నయ్య మంచివాడు కాబట్టి ఊరుకుంటున్నాడు. మరొకరయితే చెవులు మేలేసి రోగం కుదిర్చేవారు. మెత్తని వాడ్ని చేసి ఆడిస్తున్నావు-" సుజాత కల్పించుకుంది.

"అవును పాపం! మీ అన్నయ్య మెత్తని వాడు. నోట్లో వేలు పెడితే కొరకలేడు."

"ఛీ వేళ్ళెందుకు కొరకడం——సీ——" ఆపైన అనలేక కొంటెగా ఆమె నునుపైన బుగ్గల్ని ఆశగా చూశాడు కృష్ణ.

వంటగదిలోంచి దుర్గాబాయి పిలుపు మరోసారి వినరావంతో కదిలి వెళ్ళారు. ఆసంభాషణ, చిరుతగవులు అంతటితో ఆగలేదు. భోజనాలు చేస్తున్నంతసేపూ జరుగుతూనే వున్నాయి.

కూతురు, అల్లుడు, చంద్రమోహన్ సుజాత, అలా నలుగురూ కూర్చుని కబుర్లు చెప్పుకుంటూ తింటుంటే దుర్గాబాయికి కన్నుల పండువగా వుంది.

భోజనాల సమయానికి బయటికి వెళ్ళిన రామచంద్రయ్యగారు కూడా వచ్చారు.

వాళ్ళతోపాటు ఆయనకు వడ్డించింది దుర్గాబాయి.

"అత్తగారి చేతి వంటలు అమృతంలా వున్నాయి." అని లొట్టలేస్తూ సుష్టుగా భోంచేశాడు కృష్ణ. నిజానికి దుర్గాబాయి చేతి వంటకాలు చక్కగా చేస్తుంది.

అందరూ తృప్తిగా భోజనాలు ముగించి ఎవరి గది వారు వెళ్ళారు విశ్రాంతి కొరకు. సాయంత్రం వరకూ ఎవరూ గది దాటి బయటకు రాలేదు. నిద్రలేస్తూనే కాఫీ, టిఫిన్‌లు రెడీ చేసి పెట్టింది దుర్గాబాయి. మరోసారి అంతా కలసి ముచ్చటలాడుతూ కాఫీ ఫలహారాలు సేవించారు.

# 21

ఆ రాత్రి పడక గదిలో భర్త గుండెల మీద తల ఆన్చి వాహిని.

"ఏమండీ! అన్నయ్యను, వదినను చూస్తుంటే నీకేమని పిస్తుంది."

"నా కేమీ అనిపించడం లేదు. కనిపించడం లేదు. నీ లేత పెదవులే తప్ప—" సుతారంగా ఆమె పెదవుల్ని అందు కుంటూ అన్నాడు కృష్ణ.

"అబ్బ కాస్త నేను చెప్పేది వినుదురూ" దూరంగా జరిగింది వాహిని.

"ఊఁ త్వరగా కానీయ్ అదేమిటో" ఆలస్యాన్ని భరించ లేకుండా ఉన్నాడు కృష్ణ.

"వదినా—అన్నయ్య ఒకరంటే ఒకరు ఇష్టపడుతు న్నట్లున్నారు.

"వదనీ-మధ్య నీ కెందుకీ బాధ?"

"అది కాదండీ. ఒకరంటే ఒకరికి ప్రేమవున్నట్లు తోస్తుంది బయటపడడం లేదు గానీ, వారి చూపులు చేష్టలు అలాగే వున్నాయి-"

"అయితే ఇప్పుడేం చేయమంటావు?" అన్నాడు.

"అన్నయ్య ఎంతో కష్టపడి మన పెళ్ళి చేసాడు. మనం అన్నయ్యా పెళ్ళి చేస్తే బావుంటుంది-"

"బాగానే వుంటుంది అతను చేసుకోవద్దూ-"

"ఎందుకు చేసుకోడు వదిన అంటే ఇష్టమే గదా?"

"మనకెలా తెలుస్తుంది? అయినా ఇప్పుడు వారిగొడవ ఎందుకు. మరో సారి ఆలోచిద్దాం. అమూల్యమైన కాలాన్ని వృథా చేయకు డియర్. అంటూ దగ్గరకు తీసుకుని తనలో పొదువు కున్నాడు.

వాహిని మాట్లాడక లేకపోయింది.

వాహిని, కృష్ణ రెండు రోజులు వున్నారు. ఆ రెండు రోజులూ రెండునిమిషాల్లా గడిచిపోయాయి వారికి. ముఖ్యంగా సుజాతకు ఎంతో ఆనందంగా, ఫుల్లాసంగా వుంది. పుట్టి బుద్దెరిగాక అలాంటి ఆనందాన్నీ, అనుభూతి ఎన్నడూ పొంది ఎరుగదు. వాహినీ వెళ్ళిపోతుందంటే దిగులతో డీలా పడి పోయింది సుజాత.

వాహినీని పిలిచి బొట్టు పెట్టి తను తెప్పించిన చీరెల ప్యాకెట్ అందించింది వాహినీ వాటినిప్పి చూసి ఇప్పు డెందుకు వదినా ఇంత ఖరీదైన చీరలు?" అన్నది మొహ మాటంగా.

"ఏదో నా తృప్తి కోసం అయినా రోజూ పెడతానా ఏమిటి?" అభిమానంగా అన్నది సుజాత.

"రెండెందుకు. ఒకటి నీవు వుంచుకో వదినా–"

"ఫర్వాలేదు ఉంచుకో, నేను ఎక్కడికెళ్ళేదివుంది లే– ఏమిటి వాహినీ నీవు వున్న నాలుగు రోజులూ నీతో పోట్లా డాను. తీరా నీవు వెళ్ళిపోతుంటే మనసంతా దిగులుగా అయి పోతుంది–" కళ్ళలో నీళ్ళు తిరుగుతుండగా అన్నది సుజాత.

"అవునొదినా నాకూ అలాగే వుంది. మిమ్మల్ని వదిలి వెళ్ళాలని పించడం లేదు. తప్పదుగా"

"అప్పుడప్పుడూ వస్తుండూ– నీ కోసం ఎదురుచూసే ఈ వదిన ఒకటుందన్న సంగతి మరువకు–" దుఃఖాన్ని ఆపు కోలేక పోయింది సుజాత. వాహినీకి కూడా కళ్ళల్లో నీళ్ళు నిలిచాయి. వదిన అభిమానానికి కరిగిపోయింది.

"వదినా!" అంటూ సుజాతను చుట్టుకుపోయింది.

వాహిన్ని అలాగే పొదవి పట్టుకుని శిరస్సు ముద్దా డింది సుజాత.

"దేవిగారికింకా తేమల్లేదా. త్వరగా" అంటూ వచ్చాడు కృష్ణ.

కళ్ళు తుడుచుకుని లేచి నిలబడింది వాహిని.

"వస్తాను వదినా"

"మంచిది మరదలా! వచ్చే పండుగకు మంచివార్తతో రావాలి" నవ్వింది సుజాత.

"ఏమిటన్నట్లు అర్థం కాక చూసింది వాహిని సుజాత వంక.

"ఏమిటె పిచ్చిపిల్లా అలా తెల్లబోయి చూస్తావు నాకు అల్లుడు కావాలి! మీ ఆయనతో చెప్పి త్వరగా కనేయ్-" ఫక్కుమంది సుజాత.

వాహిని సిగ్గుతో తలదించేసుకుంది.

"వింటున్నావా, మా చెల్లి చెప్పే విషయం—" చిలిపిగా వాహిని బుజాన్ని కదిపాడు.

"ఛీ—మీరు మరీనూ." వాహినిబుగ్గలు ఎర్రబారాయి ఆ ఊహతో.

"వస్తామమ్మా-" అని సుజాతవద్ద శెలవు తీసుకున్నాడు కృష్ణ.

"మంచిదన్నయ్యా! అప్పుడప్పుడూ వస్తూవుండండి-" వెనకనుంచి అన్నది సుజాత.

వాళ్ళు వెళ్ళిపోతుంటే అత్యంత ప్రియమైనది చేజారిపోయినట్లు విలవిల్లాడి పోయింది సుజాత. దుఃఖాన్ని ఆపుకో లేక వెక్కి వెక్కి ఏడ్చేసింది.

వాళ్ళను సాగనంపి సుజాత గదిలోకి వచ్చాడుచంద్రమోహన్. అతనికీ బాధగానేవుంది. మగవాడుకాబట్టిబయట పడటంలేదు. ఏడ్చి ఏడ్చి ఎర్రగా ఉబ్బిన సుజాత ముఖం చూసి విషయం అర్థం చేసుకున్నాడు. వాహినివెళ్ళిపోయిందని సుజాత దిగులు పడుతుందని తెలుసుకున్నాడు.

"వూరుకో ఎందుకలా బాధపడతావు? వాళ్ళు వెళ్ళింది ఈ వూరే మరెక్కడికో దూరానికి వెళ్ళినట్లు చింతిస్తావే. కావాలనుకున్నప్పుడు రమ్మని కబురంపవచ్చు. వూరుకో" అని ధైర్యం చెప్పాడు చంద్రమోహన్.

"ఏమిటూ పిచ్చిమనసు దేనికోసం ఆత్మీయతను పెంచుకుంటుందో అర్థంకాదు." విరక్తిగా నవ్వి "పని ఎంతవరకు వచ్చింది?" అని మాట మార్చేసింది.

మరికొంచం సేపు తోటలో జరుగుతున్న వర్క్ విషయం మాట్లాడుకున్నారు. ఎన్ని మాట్లాడుకుంటున్నా వాహిని వెళ్ళిపోయిందన్న దిగులు వారినిపట్టి పీడుస్తూనే వుంది.

# 22

హేమాదేవి, చంద్రమోహన్ మీద కేసు పెట్టింది. డబ్బు కాశపడి, ఆమెను లేవదీసుకుపోయి తన ఇంట్లో పెట్టుకున్నాడని" నేరం మోపింది. కోర్టులో హాజరు కమ్మని చంద్ర

మోహన్‌కి నోటీసు వచ్చింది. ఈ విషయం విన్న సుజాత హడలిపోయింది.

"ఛీ! ఎంత నీచంగా నిందించింది. ఆమె నా అత్తయ్య అని చెప్పుకోడానికే సిగ్గేస్తుంది-" అని వాపోయింది సుజాత. "నా మీద నేరం మోపినందుకు నాకు బాధలేదు. కాని నిన్ను అలా నీచంగా అవమానిస్తూ కోర్టులో కులాగుతున్నందుకు- వ్యధ చెందుతున్నాను-" అన్నాడు బాధగా చంద్ర మోహన్.

"నేనూ వస్తాను పదండి ఏం జరుగుతుందో చూద్దాం" అన్నది ధైర్యంగా.

"సాక్షిగా ఎలాగైనా మీరు రాక తప్పదు. మీకేం భయంలేదు. నేనున్నాను కారులో తీసికెల్తాను" అనిటాక్సీలో తీసుకు వెళ్ళాడు. హేమాదేవి వాళ్లను చూస్తూనేఅయిష్టంగా ముఖం ప్రక్కకు త్రిప్పేసుకుంది.

కోర్టులో చంద్రమోహన్‌ని ఏవో ప్రశ్నలుఅడిగారు. అన్నిటికి ఓపిగా సమాధానం చెప్పాడు.

తరువాత ముద్దాయిగా సుజాత!

జనమంతా తననే వింతగా చూడడంతో సుజాతకు తల తీసేసి నట్లుంది.

సుజాతనుకూడా ఏవో ప్రశ్నలు అడిగారు చెప్పింది. చివరిగా ప్రాసిక్యూటర్ అడిగిన ప్రశ్నతో సుజాతకు వళ్లు మండిపోయింది.

"చంద్రమోహన్ నిన్ను బలవంతాన లేవదీసుకుపోయాడట నిజమేనా?"

"అబద్ధం. అతను చాలా మంచివాడు మా అత్తయ్య దుర్మార్గాన్ని సహించలేక అర్థిస్తే అతను తనఇంటికి తీసికెళ్ళి రక్షణ కల్పించాడు అతన్ని నీచంగా భావించినవారి కళ్ళు పోతాయి." ఆవేశపడిపోయింది సుజాత.

"ఆవేశం పనికి రాదమ్మా ఇది కోర్టు. అడిగిన దానికి మాత్రమే సమాధానం చెప్పాలి." అని ఆగి నుదుట పట్టిన చెమటను కర్చీఫ్‌తో అద్దుకుని తిరిగి ఇలా అడిగాడు ప్రాసిక్యూటర్.

"చంద్రమోహన్‌కి నీకూ ఏమిటి సంబంధం?"

"మనిషిక్కి మనిషికి మధ్య వున్న సంబంధమే."

"అంటే? వివరంగా చెప్పాలి."

"ఏమిటి చెప్పేది! అతను చాలా మంచి వ్యక్తి. నా కష్టాల్ని చూసి నన్ను ఆదుకుంటున్నాడు"

"అంటే ఏ ప్రతిఫలమూ ఆశించకుండా అతను నీకు సాయం చేస్తున్నాడా?"

"అవును నా నుంచి ఏమీ ఆశించలేదు."

"అతని సంరక్షణలో వుండడం నీకు మనస్ఫూర్తిగా సమ్మతమేనా?"

"ఎన్నిసార్లు చెప్పాలి అతనంటే నాకు ఇష్టమే నేను అతన్ని ప్రేమిస్తున్నాను. త్వరలో పెళ్ళికూడా చేసుకోబోతున్నాం. నేను అతనితోనే వుంటాను. ఇక చాలా" విసురుగ్గా, విసుగ్గా చెప్పింది సుజాత జడ్జిగారు సుజాత. చెప్పిన విషయాల్ని నోట్ చేసుకున్నారు.

ఆ తరువాత హేమాదేవిః బోను యెక్కించారు. ఎన్నో కల్లబొల్లి నేరాలు కల్పించి చెప్పింది కానీ ఏవీ నిలవ లేదు.

చివరిసారిగా జడ్జిగారు కేసును పరిష్కరిస్తూ ఈవిధంగా తీర్పు చెప్పారు.

"సుజాత అనే వ్యక్తి తానుగా చంద్రమోహాన్ అనే అతని సాయాన్ని అర్థించి అతనిసంరక్షణలో వుంటుంది. వారిద్దరూ ప్రేమించుకున్నారు. పెళ్ళికిసిద్ధమయ్యారు. కనుక చంద్రమోహాన్ మీాద మోపిన నేరం నిజం కాదని సుజాతమాటలవల్ల తేలింది. ఇక ఈ కేసు గురించి చెప్పేదేమిలేదు. చంద్రమొహాన్ నిర్దోషిగా తీర్మానించి కేసు కొట్టేస్తున్నాం"

సుజాత పొంగిపోయింది హేమాదేవి కృంగిపోయింది.

ఇంటికి వచ్చాక "క్షమించండి" అని అన్నది సుజాత.

"దేనికి?" ఆశ్చర్యంగా అడిగాడు చంద్రమొహాన్.

"కోర్టులో ఆవేశంలో ఏదో వాగేసాను" తలదించుకుంది సుజాత.

"ఫర్వాలేదు మీారు చెప్పినదాంట్లో బాధపడవల్సినదేమి లేదు"

"అంటే నా మాటల్ని మీారు హర్షిస్తున్నారా?"

"మీా పరిస్థితిలో నేను వున్నా అలాగే చెప్పేవాడిని. ఇక ఆ విషయం మర్చిపో—" అనేసి అక్కడ నుండి వెళ్ళిపోయాడు చంద్రమోహాన్. సుజాత ఉస్సురుమంటూ నిట్టూర్చింది.

"అలా అన్నందుకు కోప్పడతాడేమోననుకుంది. కానీ అతను మామూలుగా వుండడంతో ఆమెకు ఎన్నో ఆలోచనలు ఉవ్వెత్తున లేచాయి. "తనస్థితిలో వుంటే అలాగే చెప్పేవాడట. కేవలం అపాయ స్థితిలోనే నన్నమాట బయట పడేది. అయినా తనేమిటి అలాఅనాలోచితంగా అనేసింది. ఏమనుకున్నాడతను? తన ఉద్దేశ్యాన్ని బయట పెట్టలేదు. ఏమిటో ఆయన మనస్తత్వం తెలుసుకోవడం కష్టంగావుంది" అని నిట్టూర్చింది.

చంద్రమోహన్ ఆలోచనలు కూడా ఆ విషయం మీదే సాగాయి.

"ఎందుకలా చెప్పింది? ఆమెకు నిజంగా ఆఉద్దేశ్యమున్నదా? లేకుంటే అంత ఖచ్చితంగా చెప్పదు. అలా చెప్తున్నప్పుడు ఆమె కంఠం ఎంత దృఢంగా పలికింది. తప్పకుండా తనను ప్రేమిస్తోంది. మరి తనూ? ఏంచేయాలనుకుంటున్నాడు? ఆమె కలల్ని పండించగలడా? తొందరపడితే- తన డబ్బుకోసం ఇలాన్నానని అపోహపడే ప్రమాదమున్నది. చూద్దాం. ఎప్పటికైనా ఆమె నోటి వెంట ఆ విషయం బయట పడకపోదు. అంతవరకూ వేచిచూడాలి——"

ఒకరంటే ఒకరికి ఇష్టమే. కానీ ఆ విషయాన్ని మనసు విప్పిచెప్పుకోలేక పోతున్నారు.

తను అతన్ని కోరడం అత్యాశ అని ఆమె సంకోచిస్తుంది.

నిన్ను ప్రేమిస్తున్నాను పెళ్ళిచేసుకుంటాను అంటే నా ఆస్తికోసం నన్ను ప్రేమిస్తున్నావు. లేకుంటే నా వద్ద ఏం ప్రత్యేకత వుందని-" ఆమె ఆపార్థం చేసుకుంటుందని అతను.

ఎవరికి వారే మూగగా ఆరాధిస్తున్నారు. తపిస్తున్నారు.

కేసు ఓడిపోవడంతో హేమాదేవి పరిస్థితి కుడితిలో పడ్డ ఎలుక మాదిరి అయిపోయింది. సుజాత ఇంట్లోంచి వెళ్ళి పోయినప్పటి నుండి డబ్బు కోసం మహాకష్టంగా వుంది. డబ్బు లేనంత మాత్రాన ఖరీదైన అలవాట్లు ఎక్కడికి పోతాయి? ఈ మధ్య బాధతో వీగిపోతూ తెగ తాగేస్తుంది- చేతులో పైసలు ఖాళీ అయిపోయాయి. అప్పులు మొదలెట్టింది అవి మాత్రం ఎంత కాలం దొరుకుతాయి- తప్పనిసరిస్థితితో ఇంట్లో వున్న ఫర్నిచర్ ఒకొక్కటే అమ్మసాగింది. సీతమ్మను పని లోంచి మాన్పించేసింది.

సీతమ్మ ద్వారా ఈ విషయం తెలుసుకున్న సుజాత కసిగా పళ్ళు నూరుకుంది.

"మీ రో సారి మా ఇంటికి వెళ్ళి చూసిరావాలి." అని అన్నది చంద్రమోహన్‌తో.

"దేనికి?"

"ఇంట్లో వున్న సామానంతా అమ్మేస్తుందట- ఆ రాక్షసి..."

"ఏమిటో ఇంత జరిగినా ఆమె కింకా బుద్ధిరాలేదు."

"అలాంటి వాళ్ళకు చచ్చిన తర్వాతే మార్పువచ్చేది నా మాటగా చెప్పండి ఇల్లు ఖాళీ చేయించి ఇంటికి తాళం

వేసి రండి త్వరలో నే బేరం పెట్టి అమ్మేద్దా” అని అన్నది సుజాత.

“మరి ఆమె సంగతి?” సందేహంగా చూసాడు.

భుక్తి కోసం నెలకో రెండు వందలు పంపుతాను వేరే ఎక్కడైనా వుండమని చెప్పండి”

“సరే నీ యిష్టం. ఈ రోజే వెళ్ళొస్తాను.” అని ఆ సాయంత్రం తోట నుంచి రాగానే హేమాదేవి దగ్గరకు బయలుదేరాడు చంద్రమోహన్. గేటు తెరుచుకుని లోనికి అడుగు పెడుతుంటే ఇల్లంతా నిశ్శబ్దంగా, బావురుమని పించింది ఇంటి ముందు ఇంతకు పూర్వం ఉన్న పూల మొక్కలు, పండ్ల చెట్లు అన్నీ ఎండిపోయి కళావిహీనంగా వున్నాయ్.

మెట్లెక్కుతూ పైకి వెళ్ళాడు చంద్రమోహన్. హేమా దేవి గదిలోనే వున్నట్లనిపించి ఆగి తలుపుతట్టాడు.

“ఎవ్వరూ? అని హేమాదేవి స్వరం బావిలోంచి విని పించినట్లు మెల్లగా వినిపించింది.

“తలుపు తెరవండి” అని మరోసారి తలుపు తట్టాడు చంద్రమోహాన్.

“ఓ నీవా? రా—రా— ఏ సమయంలో నే వచ్చావు” ఆమె మాటలు ముద్దు ముద్దుగా వున్నాయి. ఆమె ఏ స్థితిలో వున్నదో అర్థం చేసుకున్నాడు చంద్రమోహన్ లోపలికి వెళ్ళాలా లేదా తటాపటాయించాడు.

“ఏమిటి చంద్రా! భయం దేనికి?— లోపలికి—” అతని చేతులు పట్టుకుని లోపలికి లాగి తలుపులు బిగించింది-

చంద్రమోహన్ తీవ్రంగా చూసాడు ఆమె. వంక ఆమె అదేమీ గమనించేస్థితిలో లేదు.

"రా, చంద్రా—— కూర్చో, ఏమిటి పని మీద వచ్చావు?" మంచం మీద వెలికిలా పడుకుంటూ మత్తుగా చూస్తూ అన్నది.

"మీతో మాట్లాలని వచ్చాను. మీరు సవ్యంగా వున్నట్లు లేరు మరోసారి కలుస్తా-" అని కదలబోయాడు చంద్రమోహన్.

"ఆఁ అగు వెళ్ళకు మాటలు తరువాత చంద్రా ఎన్నాళ్ళనుంచో నీ పైన మనసుంది. పైకి ఎంత ద్వేషించినా నీ వంటే ఎంత మోహమో చెప్పలేను రా చంద్రా తాపంతో దహించుకు పోతున్న నాకు స్వర్గాన్ని చూపించు. నా మాట కాదనకు ఒకసారి ప్లీజ్" అతని దారికి అడ్డంగా వచ్చి అతని మెడ చుట్టూ చేతులు వేసింది.

చంద్రమోహన్ ఆమెను పురుగు విదిలించినట్లు ఒక్క తోపు తోసేసాడు" దబ్బున క్రిందపడి పోయింది. ఛీ——ఛీ ఇన్నేళ్ళు వచ్చినా, సిగ్గూ లజ్జా లేదు." అసహ్యంగా చూస్తూ తలుపులు తెరచుకుని బయట కొచ్చేశాడు చంద్రమోహన్.

ఆ తిరస్కృతికి హేమాదేవి హృదయం భగభగమండి పోయింది.

"రాస్కెల్! ఎంత పొగరు? కోరి వచ్చిన ఆడదాన్ని తృణీకరించి పోయావా! చూస్తాను. నిన్ను నిలువునా చీరేయ పోతే నా పేరు హేమాదేవే కాదు- కసిగా అనుకున్నది

ఆ కోపం, కసి ఎక్కువగాగా మరో రెండు పెగ్గులు పుచ్చుకుంది. ఏదో గొణుకుతూనే వుంది. ఆతరువాత మత్తు ఆవరించగా, కళ్ళు తేలిపోగా, అచేతనంగా మంచంలో పడి పడిపోయింది.

ఇంటికి తిరిగి వచ్చిన చంద్రమోహన్ని చూసి "ఏమన్నది?" అని ఆత్రంగా ప్రశ్నించింది సుజాత.

చంద్రమోహన్ "ఆమె ఇంట్లో లేదు. ఎక్కడికో ఎక్కడికో వెళ్ళింది. రేపు వెళ్ళి మాట్లాడుతా లే-" అని క్లుప్తంగా అన్నాడు.

"మర్చిపోకుండా రేపు దాని చేత ఇల్లు ఖాళీ చేయించండి-"

"అలాగే..." అనేసి అక్కడి నుండి వెళ్ళిపోయాడు చంద్రమోహన్.

దెబ్బతిన్న హృదయం రెచ్చిపోతుంది. అవమానింప బడిన స్త్రీ అంతటితో ఆగదు. హేమాదేవి చంద్రమోహన్ పై పగ తీర్చుకోవాలని నలుగురు రౌడీలను పంపింది. కోట నుంచి వస్తుండగా దారికాచి హఠాత్తుగా మీదపడి చంద్ర మోహన్ని అక్కడే వదిలేసి వెళ్ళిపోయారు. దెబ్బలు బాగా తగిలాయి తల పగిలి రక్తం కారసాగింది. సైకిల్ని తుక్కు తుక్కుగా విరగొట్టారు.

ఎవరిదో కారు వస్తూ, చంద్రమోహన్ని చూసారు దయతలచి హాస్పటల్కి చేర్చారు. ఈ కబురు క్షణాల్లో దుర్గాబాయికి రామచంద్రయ్య గారికీ తెలిసింది. అంతేఁ ఘు మేఘాల మీద పరుగులు పెట్టారు. ఆ కంగారులో సుజాత

విషయం మర్చిపోయారు! విషయం తెలుసుకున్న సుజాత కుప్పలా కూలి పోయింది! భయంతో వణికిపోయింది.

"ఏమిటీ ఆయనకు దెబ్బలు తగిలాయా! ఎవరీ పని చేయించింది! ఇంకెవరు ఆ రాక్షసే చేయించి వుంటుంది భగవాన్! ఆయనకేమీ కానీకు ఆయన నిండుగా నూరేళ్ళు బ్రతకాలి అయ్యో ఇప్పుడెలా? అందరూ వెళ్ళిపోయారే ఆయన కెలావుందో-ప్రమాదమిమీ లేదుకదా! ఎలా తెలుస్తుంది. నా కాళ్ళుతీసేసి ఎంత తప్పుపనిచేసావయ్యా ప్రభూ" అని మున్నీరుగా విలపించింది తన అశక్తతకు.

క్షణాలు—నిమిషాలు గడుస్తున్నాయి.

సుజాత ఆత్రుత ఎక్కువవుతోంది! నిలవలేక పోతుంది రెక్కలుంటే ఎగిరి ఆయన దగ్గర వాలాలని పిస్తోంది. ముందు ఆయన్ని చూడాలని మనసు తెగ ఆరాటపడిపోతుంది. మరో పది నిమిషాలు చూసింది. ఎవరూ రాలేదు ఇక వుండలేక ధైర్యం చేసి తానే బయలు దేరింది. రోడ్డు మీదకు వస్తూనే భయమేసింది రివ్వున దూసుకు పోయే కార్లను, రిక్షాలను, బస్సులను చూస్తుంటే మొండి ధైర్యంతో వీల్ చైర్‌ని వేగంగా దొర్లించుకుంటూ కదిలింది ఆమె కళ్ళెదుట ప్రాణాప్రాయస్థితిలోవున్న చంద్రమోహన్ రూపమే కదలాడుతోంది. ఆయనకు ఎలాంటి ఆపద కలగకుండా చూడమని ముక్కోటి దేవతలను మనసులోనే ప్రార్థించింది.

చేతులు మండిపోతున్నాయి. భుజాలు నొప్పులు పుడుతున్నాయి. అయినా లెక్కచేయటం లేదు అత్యంత వేగంగా, శక్తిని కూడదీసుకుని చైర్‌ని దొర్లిస్తుంది రోడ్డును క్రాస్

చేయబోయింది అంతే! గాలికంటే వేగంగా దూసుకు వచ్చిన టాక్సీ వీల్ ఛైర్‌ని గుద్దేసింది సుజాత ఎగిరి పేవుమెంటు మీద పడింది వీల్ ఛైర్ నజ్జునజ్జు అయిపోయింది సుజాతకళ్ళు తెరిచి అరుస్తోంది ఆమె అరుపులకు చుట్టూ చాలామంది జనం మూగారు. దీనంగా, రెండు చేతుల్లో ముఖం కప్పుకుని దుఃఖిస్తుంది తన అశక్తతకు. అందరూ ఆమెనే వింతగా చూస్తున్నారు సుజాతకు పెద్దగా దెబ్బలుతగల్లేదుగాని, మో చేతులు దోక్కుపోయాయి. మోకాలు విరిగిపోయినట్లు కల్కుకుమని పీక్కుతోంది.

ఇంతలో కృష్ణ. వాహిని బజారునుంచి వస్తూ ఆ దృశ్యాన్ని చూసి అవాక్కయిపోయారు.

వారిని చూస్తూనే సుజాతకు దుఃఖం ఆగలేదు. "వాహినీ మీ అన్నయ్యకు ప్రమాదంగా వుంది హాస్పటల్లో చేర్పించారు. ముందు నన్ను అక్కడకు తీసికెళ్ళండి—"

"అన్నయ్యకు ప్రాణాపాయ స్థితా! ఎలా జరిగింది?" వణికిపోతూ అడిగింది వాహిని.

"అవన్నీ తరువాత-ముందు ఏదన్నా టాక్సీని పిలవండి త్వరగా" ఆలస్యాన్ని భరించలేకపోతున్నది సుజాత కృష్ణ ఆలస్యం చేయకుండా దారిన పోతున్న టాక్సీని ఆపి చెరో రెక్క బుచ్చుకుని అతిప్రయాసమీద సుజాతను టాక్సీలోకి చేర్పించారు. అందరూ ఎక్కారు-టాక్సీ హాస్పటల్ వేపు రివ్వున దూసుకుపోతుంది. సుజాత జరిగింది వివరించింది. కన్నీళ్ళమధ్య తను ఒక్కతే రాబోవడం మధ్యలో జరిగిన యాక్సిడెంటూ అంతా చెప్పింది. "అయ్యో! అన్నయ్యా ఎంతకష్టమొచ్చింది నీకు" వలవల ఏడ్చింది వాహిని.

మరో అయిదు నిమిషాల తరువాత టాక్సీ హాస్పటల్ ముందు ఆగింది.

సుజాతను తీసుకుని లోనికి వెళ్ళారు. వాళ్ళను అక్కడ బల్లమీద కూర్చోమని కృష్ణ లోపలి కెళ్ళాడు. రెండు నిమిషాల్లో తిరిగివచ్చి "బావకి ఆపరేషన్ చేస్తున్నారట" అని చెప్పాడు. ఆ మాట వింటూనే ఆ ఇద్దరు స్త్రీలు అదిరిపడ్డారు. కృష్ణ ధైర్యం చెప్పాడు-అయినా వినేదు వాళ్ళు. ఏడుస్తూనే వున్నారు. ఇంతలో రామచంద్రయ్యగారు, దుర్గాబాయికూడా బయటకు వచ్చారు.

ఎవరూ మాట్లాడంలేదు. అందరి కంఠాలు మూగపోయాయి.

అందరి కళ్ళల్లోనూ నీళ్ళు నిలిచాయి. "చంద్రమోహన్ ఆరోగ్యవంతునిగా తిరిగి రావాలని" అందరూ మనసులోనే దేవుడ్ని ప్రార్థిస్తున్నారు. నిమిషాలు దొర్లుతున్నాయి. అందరిలోనూ ఆతృత ఎక్కువవసాగింది. గుండెలతివేగంగా కొట్టుకుంటున్నాయి. ఎలాంటి విషయం వినాల్సి వస్తుందోనని ప్రాణాలరచేతిలో పెట్టుకుని వున్నారు.

మరో అర్ధగంట తర్వాత డాక్టర్ తృప్తిగా బయటకు వచ్చాడు.

అందరూ ఆయన్ని చుట్టుముట్టారు. సుజాత దూరంనుంచే ఆత్రంగా చూస్తుంది డాక్టర్‌ని.

"మరేం కంగారు పడనలసిన పనిలేదు. ప్రాణాపాయం తప్పిపోయింది. తలకు, చేతులకు బలమయిన గాయాలు తగి

లాయి. కొద్దిసేపట్లో స్పృహ వస్తుంది..." అని చెప్పాడు డాక్టర్.

"హమ్మయ్య" అని అందరి గుండెలు తేలికయ్యాయి.

అప్పుడు గమనించారు సుజాతను, రామచంద్రయ్య గారూ, దుర్గాబాయి.

"అయ్యో! కంగారులో నీ మాటే మరిచాను తల్లీ! ఎలావచ్చావు? ఆ రక్తమేమిటి?" అని కంగారు పడిపోతూ అడిగింది దుర్గాబాయి.

"వదినను ఒక్కదాన్నే వదిలేసి వస్తిని. అన్నయ్యకు దెబ్బలు తగిలాయని తెలిసి ఉండలేక ఒక్కర్తే బయలు దేరింది. మధ్యలో యాక్సిడెంట్...అదృష్ట బావుండి బ్రతికింది కొంచంలో ప్రాణం పోయేది" అని చెప్పింది వాహిని.

"అమ్మయ్య! ఎంత గండం గడిచింది—లేచి ఎవరిముఖం చూసానో యిద్దరికీ ప్రాణాపాయం తప్పింది—" అన్నది దుర్గాబాయి.

కృష్ణ డాక్టర్ని పిలిచి సుజాత గాయాలకు మందు వేయించాడు.

మరో గంట తర్వాత చంద్రమోహన్కి స్పృహ వచ్చిందని తెలిసి హడావుడిగా బయలుదేరారు.

"నన్నూ తీసికెళ్ళండి ఆయన్ని చూడాలి—" అన్నది సుజాత.

అందరు కలిసి సుజాతను కూడా తీసికెళ్ళారు.

అలా అంటూ తనను పట్టి తీసికెళుతుంటే సుజాతకు దుఃఖమూ, సిగ్గూ రెండూ కలిగాయి. తన అత్తకు మరోసారి వగచింది.

చంద్రమోహన్ బరువుగా కనురెప్పలెత్తి చూశాడు తన ఎదుట్గా నిలబడి ఆత్రుతగా తననే చూస్తున్న అందర్నీ పలకరింపుగా నవ్వాడు

"బాబూ! యెలావుంది నాయనా? దేవునిదయవల్ల బతికి బయటపడ్డావు అంతే చాలు" ప్రక్కనే కూర్చుని దిగులుగా అడిగింది దుర్గాబాయి.

"నాకు బాగానే వుంది" చంద్రమోహన్ పెదవులు అస్పష్టంగా గొణిగాయి.

"అత్తయ్యా! మామయ్యా! బావను ఎక్కువగా మాట్లాడించవద్దన్నాడు డాక్టరుగారు రండి బయటకు వెళదాం...విశ్రాంతి తీసుకోనివ్వండి" అందర్నీ అవతలకు తీసుకుపోయాడు కృష్ణ.

అక్కడ సుజాత ఒక్కతే మిగిలింది. చెమ్మగిల్లిన కళ్ళతో ఆర్తిగా అతన్నే చూస్తుంది.

"సుజాతా నుదుటికి ఆ గాయాలేమిటి?" ఆశ్చర్యంగా అడిగాడు మెల్లిగా.

"ఏం లేదు మీకు దెబ్బలు తగిలాయన్న కంగారులో-గోడకు కొట్టుకుంది. చిన్న గాయం... అదిసరే మీ కెలా వుంది?"

'నాకు బాగానేవుంది. మరేం వర్రీలేదు- మాట్లాడుతున్నాగా" నవ్వబోయాడు. నరాలు కలుక్కుమనగానే ఆ ప్రయత్నం విరమించుకున్నాడు.

"నా మూలంగానే మీకిన్ని ఆపదలు, కష్టాలు"

"నీవేం చేసావు? వెధవలు చీకట్లో కొట్టి పారిపోయారు..."

ఆ పని ఎవరు చేయించారో తెలుసా?"

"తెలీదు. కానీ ఊహించగలను. మీ అత్తయ్య హేమాదేవిగారు చేయించివుంటుంది"

"ఆది మనిషిజన్మ ఎత్తలేదు. దాన్ని జైలుకు పంపిస్తే గానీ నా కసి చల్లారదు" పళ్ళు నూరుతూ ఆవేశపడిపోయింది సుజాత. చంద్రమోహన్ మాట్లాడలేకపోయాడు. మౌనంగా ఆమెనే చూస్తూ వుండిపోయాడు.

మరో వారంరోజుల తరువాత చంద్రమోహన్ని కట్లు విప్పి డిచ్చార్జి చేశారు. తలకు తగిలిన గాయం ఇంకా మాననందున ఆకట్టు అలాగే వుంచారు. రోజూ వచ్చి చూపించుకు వెళ్ళమని చెప్పాడు డాక్టర్.

సుజాత అతన్ని ఎక్కడికీ కదలనివ్వడంలేదు. అతని మంచం వద్దే కూర్చుని సపర్యలు చేస్తుంది. టైం ప్రకారం మందులు ఇస్తుంది- ఆమె శ్రమకు నొచ్చుకున్నాడు చంద్రమోహన్-

"అమ్మ వుందిగా నీకెందుకు శ్రమ?"

"ఏం నేను చేయకూడదా? సూటిగా అతని కళ్ళలోకి చూసింది సుజాత.

లోకి చూసింది. అతని కళ్ళలో ప్రతిఫలించే భావాలకు ఆమె పరవశించిపోయింది.

"నిజంగా అడగమంటారా-" మెల్లనిస్వరాసతలదించు కొని అన్నది సుజాత.

"నిజంగానే తీరుస్తాను. చెప్పు-" నవ్వుతూ అన్నాడు చంద్రమోహన్.

"నాకు.. నాకు..."ఆగి అతని కళ్ళలోకి చూసింది— అతనికళ్ళు నవ్వుతున్నాయి.

"ఆగిపోయావేం అడుగు-"

"ఇప్పుడు కాదు-"సిగ్గుపడిపోయింది తనకోరిక వెల్ల డించడానికి.

"ఇంకెప్పుడు ?"

"మరోసారి-"

"లేదు. ఇప్పుడే"

"ముందు తోటలో బిల్డింగ్ వర్క్ పూర్తి కానివ్వండి ఆ తరువాత..."

"ఓస్! అందాకా ఆగాలా?"నిరుత్సాహంగాఅన్నాడు చంద్రమోహన్-

"కాలం వేగంగా దూసుకుపోతుంది. చంద్రమోహన్ తిరిగి సంపూర్ణ ఆరోగ్యవంతుడయ్యాడు. పని ముమ్మరంగా సాగిపోతుంది మరో నెలలో అంతా పూర్తయిపోతుంది.తరు వాత ఏం చేయాలనుకుందోనని ఆ విషయమే సుజాతతో అన్నాడు చంద్రమోహన్.

"నీవు నాపైన పెట్టిన బాధ్యత పూర్తికావస్తుంది.తరు వాత ఏం చేయాలి?" నవ్వుతూ అడిగాడు.

"చేసేదేముంది. బిల్డింగ్ పని పూర్తి కాగానే, గవర్న మెంటు వారికి స్వాధీనపరచేది-"

"ఏమిటి ఇంత కష్టపడి చేసింది గవర్నమెంటు వారికి ఇవ్వడానికా?"

"మరి ఆ కార్య భారాన్ని ఎవరు మోయగలరు? నేను అశక్తురాల్ని గదా ఇప్పుడంటే మీరున్నారు చేస్తున్నారు? ఎల్లకాలం తోడుగా వుంటారా ఏమిటి? అతన్నే నిశితంగా చూస్తూ అన్నది సుజాత.

అతను మాట్లాడ లేదు మౌనంగావుండిపోయాడు. కొన్ని క్షణాల తరువాత ఇలా అన్నాడు.

"నీవు ఒక మంచిపని చేయాలన్న ఉద్దేశంతో ఇంతడబ్బు ఖర్చు పెట్టి పని పూర్తిచేయించావు. అది అనాధులకు వికలాంగులకు వినియోగ పడాలంటే దాన్ని మనమే నిర్వహించాలి దిక్కూ మొక్కూ లేని వాళ్లకు ఏదైనా చేతిపనులు కల్పించి వారి జీవనం వారు గడుపుకునేలా చేయాలి. ఎవరు చేయగలిగిన పని వారికి. ఇలా ఎన్నో ప్రణాళికకు ఆలోచించి-నిర్వర్తించగలిగినప్పుడే నీవు ఆశించిన ఫలితం కనిపిస్తుంది. అందుకని మనంకూడా అక్కడే వుండేందుకు ప్రయత్నించాలి."

"మనం అంటున్నారు. మీరుకూడా..."ఆగిచిలిపిగా చూసింది.

"నీ కిష్టమైతే నేనుకూడా" అతనూనవ్వాడు.కొంటెగా.

ఆమె హృదయం పురివిప్పిన మయూరంలా గెంతింది. "ఇది కలా! నిజమా—!?"

"నీ కలల్ని నిజంచేస్తాను. నీ కిష్టమైతేనే" నవ్వుతూనే అన్నాడు చంద్రమోహన్. 

"మీరు. మీరు దేవుడు" ఆపైన మాటలు కరువై అతని పాదాలపై వాలిపోయింది.

ఛ. అక్కడ కాదు నీ స్థానం—ఇక్కడ దేవీ." మృదు మధురంగా అంటూ ఆమెను లేవనెత్తి హృదయానికిహత్తుకు న్నాడు చంద్రమోహన్. 

"ఈ నాటికోరకే నేను తపస్సు చేసాను. నా భాగ్యం ఏమని వర్ణించను. నా మొర ఆలించి ఆ దేముడు మిమ్మల్ని ప్రసాదించారు. చాలు-నా బ్రతుకు ధన్యమయింది ఇక నేను మరణించినా ఫర్వాలేదు. నా జీవితానికి అర్థం పరమార్థం దొరికింది." ఆవేశంతో ఊగిపోతూ అతని మెడచుట్టూ చేతులు వేసి అతన్ని హత్తుకుపోయింది సుజాత.

"సుజా! ఇంత ప్రేమను ఎక్కడదాచావు ఇన్నాళ్లూ?"

"మీ కోసమే ఈ గుండెల్లో భద్రపరిచాను. ఇన్నాళ్ళకు నా కలలు పండించారు."ఆపైన సుజాతకుఆనందంతో మాటలు కరువయ్యాయి. ఆత్రిగా ఆమెను హృదయానికి చేర్చుకుని ఆమె చెక్కిలిని సున్నితంగా స్పృశించాడు. ఆమె పరవశంతో మెలికలు తిరిగిపోయింది. మోడు వారిన లతి చివుర్చినట్లు ఆమె ఎదలో కోటిరాగాలు తీయగా పలి పించాయి.

ఒకరి కౌగిలిలో ఒకరు ఒరిగిపోయి అలా ఎంతసేపు వుండిపోయారో తెలీదు వారికే!"

